గద్యమో పద్యమో వ్యాసమో - ఉపన్యాసమో, ఏవో ఇన్ని 'ముక్కలు' వ్రాయని 'వారము' నాకు విత్రుపాసమువంటిది. వ్రాసినదంతయు అచ్చునకుఁ దేవలయునన్న 'మోజు' లేకపోయి నను, ఎదిగిన ఆఁడుపిల్లలనువోలె ఇంటఁ బడియున్న 'వ్రాఁత ప్రతులను' జూచుకొన్నప్పుడు ఒకానొక విచారము పుట్టుకొని రాక తప్పదు.

ఈ కథ ఇట్లుండఁగా 'మా స్వామి' కథ

రెండేండ్లకు మున్ను యాదృచ్ఛికముగాఁ జేసిన ఈ రచ నకు కథానాయకుఁడే కాదు, కావ్యపతియు ఒక్కఁడే కావుటను, ఈ యచ్చులో అచ్చముగా 'స్వార్జితమే' వెచ్చింపవలెనన్న విశ్వాస ముతో కాలక్షేపము చేయుచున్న నాకు ఒకనాఁడు అతర్కితముగా 'జీవిత-భీమా'కై నీకు రావలసిన దిదిగో నని ఒకానొక పద్దుగా 'పంద్రెండు నూర్లకు'లోపుగా 'చెక్కు' చేతికి వచ్చినది

సర్వస్వామ్యములు స్వామి కంకితము చేయుటయే పరాయణ ముగా భావించి వెంటనే ఈ రచనను అచ్చున కిచ్చితిని.

ముప్పదిమూఁడేండ్ల నా యీ భృతకోపాధ్యాయ పదవిలో - ఇరువది యయిదేండ్లనాఁడు వేసికొన్న 'విత్తనము' ఈ 'మంచి పనికి' బీజమై 'ఫలసాయ' మిచ్చినదని యెంచి బ్రహ్మానంద మందితిని. శాబ్దికముగా ఆర్థికముగా నా చేసిన ఈ ప్రయత్నము నకు విలువ కట్టవలసినది చదువరులే యన్న సంబరముతో ముందుచూపులో నుఁదును. —స

**ఏడుకొండలవానికి నేడునూర్ల**
**పద్యములు దండలుగ గ్రుచ్చి పదిలపఱచి**
**తెచ్చుకొంటిని భక్తిమై నిచ్చుకొంటి**
**నింతకన్న ధనంబు నా కేది కలదు ?**

స్వామి ! నీ మూలమున నాకుఁ బ్రాప్తమైన
యీ కవిత్వధనమ్ము నింకెవరి కిత్తు ?
వయసు ముదిరినకొలఁదియు భయము భక్తి
కుదిరి నీ సేవలో నన్ను బ్రదుకనిమ్ము.

ఓం

# హే స్వామి

తూర్పు తెలతెలవాఱగాఁ దోఁచె నిపుడు
నిన్నుఁ బూజింప వచ్చియు నిలిచియున్న
భక్తబృందంబుఁ గాంచి శుభంబు లొసఁగ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨

వాంఛితార్థంబు లొసఁగెడివాఁడ వంచు
నెమ్మనమ్మున నమ్మి నీ సమ్ముఖమ్ము
చేరవచ్చిరి భక్తు; లవ్వారిఁ బ్రోవ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

3

దవ్వుదవ్వులనుండియు దారిఁ జూపఁ
దగిన స్వామివి నీవకాదా యటంచు
నెంచి వచ్చిరి భక్తు లింటిల్లిపాది
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪

ఆపదల నెల్లఁ ద్రుటిలోన పాపఁగలవ
టంచుఁ బెద్దయు విశ్వాస ముంచి మంచి
త్రోవఁ బోయెడివారిని బ్రోవ నీవు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫

నీదు సర్వావతార సద్గాథ లెల్ల
వింటి మిప్పుడు నీ మూర్తి గంటిమయ్య
కఱవు తీఱఁగ నిట్టి భాగ్యం బొసంగ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬

ఆలుబిడ్డల కీ విలువేలు పనుచు
బోధ చేసితిఁ గొన్నాళ్ళు; పూర్వమైన
నీదుశక్తిని గుర్తింప నేర్చిరయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౭

జపము తపము లొనర్పఁగాఁ జాలమంచుఁ
జదువు సంధ్యలు చక్కఁగాఁ గుదురవంచు
బాధపడ మొక్క నీదు సంబంధ మున్న
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౮

భాగ్యభోగ్యంబు లేవో కావలయు నంచు
నెంచి నీ దరి చేరితి మంచు మదిని
దలఁపవల, దది భక్తుని దారి గాదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౯

ఆస్తికత నాస్తికత వాద మంత నీదు
శక్తియుక్తులు తెలియఁగా సమసిపోవు
నీ రహస్య మెఱింగినవారిఁ బ్రోవ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౦

ఏడుకొండలవాఁడ! నన్నేలుకొంచుఁ
జేదుకో స్వామి పైకి వచ్చెదను నేను
నీదుదర్శన మిచ్చి నన్నాదుకొనఁగ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౧

జననమరణమ్ములందలి సత్య మేమొ
కొంచెమేనియుఁ దెలియక కొట్టుకొందు;
మట్టి మము భవ్యదృష్టిఁ గన్పెట్టి ప్రోవ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౨

సారమది లేని వట్టి సంసారమందు
మునిఁగి తేలెడి మమువంటి మూర్ఖ జనము
నుద్ధరింపంగ నెవ్వఁ డింకొకఁడు గలఁడు ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౩

మీఁదు కట్టియు భక్తిప్రమేయబుద్ధి
వత్తు రెందఱో నినుఁ జూడవలయునంచు
వారి కోరిక మన్నింపవలయుఁ గాన
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౪

లోకులను జేర్చి మోసంబులోన ముంచి
తలలు మార్చెడి వట్టి ధూర్తులకుఁగూడఁ
దలలు గొఱిగించి జ్ఞానంబు కలుగఁజేయ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౫

దైవతంబులలోన నీ దర్పమునకు
సాటి రాఁగలవార లెచ్చటను లేరు
నీదుమూర్తియె యాకర్షణీయమయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౬

కలియుగంబున నీవు సాక్షాత్కరించు
దైవమని పెద్ద లందురు దాని తత్త్వ
మక్షరాలుగఁ బ్రత్యక్ష మగును స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౭

కొండకొమ్మునఁ గూర్చుండి కులుకుచుండు
స్వామి! నీకోసమని యెంత శ్రమకునైన
నోర్తు రయ్యాది భక్తుల కొక పరీక్ష
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౮

అంతదూరము శ్రమపడి యరిగి కాళ్ళు
బలపములు గట్టినను బడల్పడియుఁ దుదకు
నిన్ను దర్శింప బాధ లన్నియు హరించు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౯

తిరుపతమ్ములు కలవు మా దేశమందు
తిరుపతయ్యల లెక్కకుఁ గొరుగు లేదు
ఏమి నీ మాయ స్వామి! నిన్నేమి యనము?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౦

తెలుఁగుదేశము నోముల ఫలము నీవు
తెనుఁగుగడ్డకు దక్కిన ధనము నీవు
తెలుఁగుజాతికి దొరకిన తీర్థ మీవు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౧

నిలువుదోపిళ్ళు మ్రొక్కులు నీకు ముద్దు
లిచ్చుఁ గావున నెగఁబడి వచ్చు జనము;
వచ్చి యాపద గడువని వారు లేరు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౨

ఎన్ని చదువులు చదివిన నిన్నుఁగూర్చి
యెఱుఁగ నేరని మానిసి దేమి లెక్క !
నిన్ను మఱచిన చదువులు నీరసములు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౩

త్యాగరాజయ్య కోరఁగా దర్శనంబు
నిచ్చినాఁడవు; ధన మేమి తెచ్చినాఁడు ?
నీదులీలలు వర్ణింప నేరమయ్య
వేగ రావయ్య తిఱుమల వేంకటేశ !

౨౪

సిరి గలాఁడని యెవ్వనిఁ జేరనీవు
బక్కవాఁడని ప్రక్కకుఁ బంపఁబోవు
నీ రహస్యము తెలియఁగా నేరమయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౨౫

నీవు కోటీశ్వరుండవే కావు స్వామి!
వేదవేదాంతవేద్యుఁడ వౌదువయ్యా
నీదు వైఖరి చిత్రింప నేరమయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౨౬

ఎన్ని భవనంబు లున్న నీ సన్నిధికిని
వచ్చువారికి వసతులు హెచ్చు కావు;
కారణం బేమొ చెప్పఁగాఁగలమె మేము!
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౨౭

నీదు బ్రహ్మోత్సవంబుల నాదిశేషుఁ
డైన వర్ణింపలేఁడని యభినుతింతు
నో యనంతా! త్రివిక్రమా! యో నృసింహా!
నేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౨౮

నాస్తికమ్మన్యుఁడయ్యు నీ యాస్తికతకు
ముగ్ధుఁడై బుద్ధిలోనైన మోజుపడును
నీదు దర్శనభాగ్యమం దేదొ కలదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౯

సంధ్యవేళను గోవెలచాయఁ బోయి
చేష్ట లుడిగి నమస్కరించితిని గాని
నీదుధోరణి యర్థమే కాదు స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౦

నిచ్చలును నీదుపజ్జను వచ్చువార
లెంత పుణ్యాత్ములో యని సంతసింతు;
ఆ మహాభాగ్య మబ్బునా యని తలంతు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౧

ఏ పురాకృతసుకృతమో యెవరు చెప్పఁ
గలరు 'క్షేత్రయ్య' విజ్ఞానగరిమఁ గూర్చి;
అతఁడు పాడిన కథలు నీ కతికిపోయె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౨

తండ్రి తాతయుఁ గాదు ముత్తాతలుగను
'తాళ్ళపాక' ఘనులు నీ తపము చేసి
నీదుకొలువునఁ జేరిరో బోధపడదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౩

విజయనగరమహీశులే వెడలివచ్చి
'కోశ' మర్పించిరఁట నీదు కోవెలకును
నీదుభక్తులు మహనీయు లౌదురయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౪

నీదుభక్తుల కాపద యేదియేని
దాపురించిననాఁడు నీ ప్రాపు చూపి
యాదరించెదవని నా యనుభవంబు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౫

ఇహపరంబులు రెండింట సహకరించు
మార్గములు నిన్నుఁ గొల్చెడి మానవులకుఁ
జూపి నడపించి కాపాడఁజాలవయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౬

ఎవని కేది యభీష్టమో యెఱిఁగి, రోగి
రోగమును దీర్చి యైహికభోగ మిచ్చు
మంచివైద్యుఁడ వంచు నే నెంచుకొంటి
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౭

మందుమాఁకులు పుట్లకొలంది మ్రింగి
ఫలిత మది లేక యెన్నేండ్లో బాధపడిన
రోగులకు సౌఖ్య మిత్తువు సేగి దీర్చి
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౮

నీదుగారడిలోన మునింగిపోయి
నీదుమాయలు తెలియక బాధపడుచు
నుందు మో స్వామి! దీని కే మందు కలదొ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౯

హేతువాదంబు సల్పి యే దేని నిర్ణ
యింప నెవ్వానికిని సాధ్య మెట్టులగును?
ఆప్తవాక్యమె కొంత న్యాయ్యంబు గూర్చు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ?

౭౦

ఆప్తవాక్యమువంటి వేదాంతవిద్య
నీదుతత్త్వంబు చక్కఁగా నిర్ణయించు;
అది యెఱింగినవారె పుణ్యాత్ములయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౭౧

ఉపనిషత్తులలోన నీ యున్నరూపు
మూలముట్టుగఁ దెలియంగ నీలు కలదు;
అదియె వేదాంతవిద్యగా నవతరించె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౭౨

భాష్యములు చూచి వ్యాఖ్యానభాగ మరసి
నీ రహస్యంబు గుర్తింపనేర్చువాఁడు
నూటికో కోటికో యొక్కఁ డోట నుండు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౭౩

అంతదాఁక శ్రమంపడి యన్ని చదివి
నిన్ను గుర్తింపనట్టి మనీషికన్న
ధరణి నినుఁ గొల్చువాఁడె యుత్తముఁడు స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౪

ధనము విద్యయు మదము పెంచును దదీయ
బలముచేతను మైకము గలిగి వాస్త
వంబు గుర్తింపఁ గొంత కష్టంబె యగును
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౫

ఉన్న యాయుష్యమునఁ దుద కున్న వ్యవధి
చాలఁ దక్కువ గాన నీ చదువులేల?
నిన్నెఱింగించు చదువది యున్నఁ జాలు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౬

చదువు లనుపేరఁ బెద్ద యస్త్రములు నేర్చి
భౌతికంబుగ లాభంబు పడయవచ్చు
కాని, పరమార్థమున కది కాదు దారి
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౭

శాస్త్రచర్చలు సేయఁగాఁ జాలిఁయుండి
నీ ప్రమేయమె లేని మనీషివలనఁ
గలుగవలసిన లాభంబు గలుగదయ్య
వేగ రావయ్య తిపుమల వేంకటేశ!

౪౮

నందనా రేమి చదివి యానంద మందె
తిన్నఁ డే పాటి చదువులు తీర్చిదిద్దె
వారి కున్నది భక్తిభావంబె కాదె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౯

భద్రమైనట్టి కొండ పైభాగమందుఁ
గుడిచి కూర్చుండి కపిలక కోట్లకొలఁది
సొమ్ము తెప్పింతె వెంత చోద్యమ్ము స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౦

నేను నేనందు మైకము పూని నీదు
దర్శనమ్మున కెగఁబడి గారి కాచి
పరువు లెత్తెద రేమయ్య పరమపురుష!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౧

ఇలియు బలియు నెఱుంగని హీనుఁడైన
నీదుసన్నిధి త్యాగంబు నేర్చుకొనును,
త్యాగమే ముక్తి కొరక ముఖ్యభాగమయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౨

కొండ కెక్కినపిదప నీ గుడికి నడుగు
పెట్టితినో లేదో మంత్రంబు పెట్టినట్లు
తిరుగఁదోడితివయ్యా నా తీర్పు లెల్ల
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౧౩

చాలఁ బుస్తకములు చూచి కాల మెల్లఁ
జాలఁ గడపితిఁగాని నీ జ్ఞాన మేమి
తెలియదన్నట్టి జ్ఞానమే కలిగె నిపుడు
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౧౪

మొదట 'కోవెల' దృశ్యమే మోహపఱిచెఁ
బిదప నీ యున్నయునికి సంప్రీతి గూర్చెఁ
దుదకుఁ జుట్టఱికంబది దొరకె నాకు
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౧౫

ఇంట నొంటను జీర్ణించుకొంటి నిన్నుఁ
గంటికిని నీదుమూర్తిని గట్టుకొంటి
నింక నాకేమి తఱుగు రమేశ ! శ్రీశ !
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౫౬

నేను బ్రదికెడి కాల మెంతైనఁగాని
నీ ప్రమేయమె దానిలో నిలిచియున్నఁ
జాలు నా జన్మమున కది సార్థకంబు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౭

జన్మరాహిత్య మను వాక్యసరణిగాని
స్వర్గ సామ్రాజ్య సౌఖ్య సంపత్తిగాని
మొదలు నాకేమి తెలియదు ముఖ్య మీవె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౮

నిన్నుఁ బువ్వులఁ బూజించి సన్నుతింపఁ
దలఁచి యుండునుగాని యీ దారి సరిగఁ
దెలియ దాయెను; దాని కీ నలుగఁబోక
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౯

నిత్యకల్యాణముగ నెంచు నీ యనంత
మూర్తి కారతి యిచ్చి సంపూర్ణభక్తి
నేర్చుకోవలె రవ్వంత నేర్పవయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౦

విశ్వమోహనమూర్తి! నీ విక్రమాది
గుణగణంబులు వర్ణింపఁ గోరుచుందు;
దాని కనువైన దారి యేదేని చూప
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౧

నేను జదివిన చదువులలోని సార
మిప్పుడే యర్థమగుచున్న దేమి మాయ!
దీని కంతకు మూల మేదైనఁగాని
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౨

చదువుసంధ్యలు నేర్చి నీ జాడ యెఱిఁగి
సాటివారికి బోధింపఁజాలినట్టి
బుద్ధిమంతులై ధన్యు లీ పుడమియందు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౩

చదువులకుఁ దోడు భక్తియుఁ గుదిరెనేని
మెఱుఁగుబంగారు వాసన పొరయునట్లు
లింపుసొంపయి లోకము పెంపు కూర్చు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౪

ఎందఱెందఱో పుణ్యాత్ము లింతవఱక
నీదు మహిమను వర్ణింప నేర్చిరయ్య
వారి మాటలె బోధలై వఱలె మాకు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౫

విశ్వరూపుండవని నిన్ను శాశ్వతముగ
వేదములు శాస్త్రములు లెస్స బోధపఱిచె;
వానిసారి మెఱుఁగనివారు గలరు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౬

అభవుఁడవు నీవు కావున సర్వవ్యాపకుఁడవు
నిర్వికారుండ వెప్పుడు నిర్గుణుండ
ఏ విచిత్రప్రవృత్తి నీ కెట్లు తెలియు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౭

అప్పుడప్పుడు లోకముముప్పు దీర్ప
అవతరించెదవంట వాని యర్థ మెఱిఁగి
ధన్యులై నట్టివార లీ ధరణిఁ గలరు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౮

అవతరించియు లోకమం దతికిపోయి
దేశకాలము లెఱిఁగి 'సందేశ' మిత్తు
విట్టి చిత్రము లన్ని మే మెఱుఁగఁగలమె!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౯

నీవుగా వచ్చి చెప్పియు నేర్పియున్న
మాటలే లోకమున రాచబాట లాయె;
వాని యర్థంబు తెలియనివారిఁ బ్రోవ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౦

నీ విచిత్రప్రవృత్తిలో నిర్ణయింపఁ
బడిన సిద్ధాంతభాగంబు పరమపురుష!
బుద్ధి కెక్కదు; తికమక పోదు స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౧

భాషలో వాక్యసరణిలో భావమందో
లోప మేదేని కలిగి కల్లోలపఱచు
చుండెనో యేమొ తెలియక యుందుమయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౭౨

ధ్వనులు వ్యంగ్యంబు లిట్టి చిత్రములు పన్ని
వానిలో నిన్నుఁ బొదివి కాపాడినారు;
నాని వివరించువారు దూరానఁ గలరు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౭౩

సూటిగా నీదుతత్త్వ మిచ్చోటఁ జెప్పి
రందు నాశించువారి నూరించు గాథ
లున్నవే గాని తృప్తి లేకున్నదయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౭౪

జ్ఞానయోగ మెఱుంగని మానవులకు
భక్తిమార్గ మొకింతగా ముక్తి నిచ్చు
నందు రదిమాత్ర మందఱ కందునయ్య?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౭౫

నీదు సర్వావతారంబుగాదె భువిని
భక్తియోగము పోషించి రక్తిఁ గొలుపు
నదియె భక్తుల కాశ్రయంబై తనర్చు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౭౬

నీయొనర్చిన సృష్టిలో నీ యనంత
రూపమే కానవచ్చి తద్రూపముగను
వలయు లక్ష్యంబు గూర్చి కాపాడుచుండు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౭౭

చెట్టునకుఁ బుట్టకును మ్రొక్కు టెట్టు చెల్లు
నంచు వాదించి సందేహ మందనేల ?
అవియు నీ రూపమే యని యన్వయింతు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౭౮

మనసు నిశ్చలమై యొక మార్గమందు
నిలుచుటకు నీదుకోవెల నెలవుగాని
నీవు లేనట్టి చోటు కన్పించునయ్య !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౭౯

గుడులు గోపురములు గట్టి కొంత సొమ్ము
వమ్ము చేయుట బుద్ధిలోపమ్మటంచు
హేతువాదము పల్కుట నీతి కాదు;
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౮౦

నిన్ను గుర్తించు మార్గ మిందున్నదంచు
నమ్మి పూర్వులు కట్టించినారు గుళ్ళు;
వారి భక్తిప్రపత్తు లా తీరు నడచె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౮౧

శిల్పసంపదలోని వైశిష్ట్య మెల్ల
భక్తిరసమున మెదపి కాపాడుచున్న
గుళులు విజ్ఞానమునకును గుదురుగాదె!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౮౨

కోవెలకు దేహామునకును గొంత సామ్య
మున్నదని పెద్దపెద్దలే యొప్పుకొనిరి;
ఆ రహస్యంబు తెలిసినవారె ఘనులు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౮౩

మనకు మన దేహ మొట్టి సాధనము భువిని
గుడియు నొక సాధనంబయి గుణము నిచ్చు;
వాని వాస్తులోన లాభములు తెలియు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౮౪

ప్రకృతిసంపద చూపి తత్ఫలిత మిచ్చి
హాయిగా నారగించి సౌఖ్యములు పడయుఁ
డంచు సూచింతు వది మాకు నర్థమగునె !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౮౫

స్వామి ! నీ సృష్టిలో నెట్టి వస్తువైన
నేదొ ఫలితంబు నొకటి తా నిచ్చితీరు;
నది రహస్యంబు చేసి దాఁచెదవుగాని
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౮౬

ప్రాణములు దీయు గరళంబె ప్రాణ మిచ్చు
నౌషధంబుగఁ జూపింతువయ్య స్వామి !
అదియె నీ సృష్టిలో నున్న యద్భుతంబు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౮౭

ఎవరి కెవ్వారు ముఖ్యులో యెఱుఁగ గాని
బంధములు గొన్ని తెచ్చి వేర్పఱిచి నీవు
వింతవింతగ నాట లాడింతువయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౯—౨

అలంతి యలంతిగ లోకులు పిలుచుకొనెడి
జీవులే నీదు సృష్టివైచిత్రి చూపి
బోధ చేయును గుర్తింపంబోము గాని,
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౯—౩

చీమకన్నను జిత్రవిచిత్రమైన
చిన్నిజీవులం బెక్కింటి సృష్టి చేసి
యాటలాడింతు వందలి యర్థ మేమొ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౯—౪

ఇన్ని సృష్టించియును పీని కున్న సర్వ
'బాధ్యత'లు చక్కం జూచి కాపాడుచుందు
వేమి నీ నేర్పు! నీ మాయ యెవరి కెఱుక !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౯—౫

పురుగు పున్నెంబు లిట్టి పీ పుట్టువందు
సర్వజీవుల కిచ్చి కష్టములలోనె
యిష్టములు కొన్ని తీర్తువ దేమి మాయ !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౦౦

ఎన్ని విద్యలు నేర్చి మఱెన్ని పాట్లు
పడినవాఁడైన నీ ప్రేమ పడయఁడేని
వానికన్నను మూర్ఖుఁ డెవ్వాఁడు కలఁడు?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౦౧

యోగమని జ్ఞానమని స్వల్పభాగ మేదో
తెలిసి తెలియక నినుఁగూర్చి కలలు గనిన
వాని, కే లాభమును లేదు వసుధలోన
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౦౨

నిన్ను ధ్యానములో నొక్క నిమిషమైన
నిలుపలేనైతి మనసు నిశ్చలము కామి;
దాని కక్కఱయైన సాధన మొసంగ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౦౩

సాధనము చేయ సర్వంబు సాధ్యమంచు
నెంచెదముగాని నీ ధ్యాన మించుకంత
యైనఁ బనుపడకున్న దేమయ్య స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౦౪

వాక్కులకు నందఁగారానివాఁడ వంచుఁ
గంటి కెదురైనవాఁడవే కావటంచు
వేదములె పల్కుచుండ మా కేది సుగతి?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౦౫

నీదు వంశంబులో మహనీయమైన
యంశమును బుచ్చుకొని భువి నవతరించు
వారె సర్వత్ర పూజ్యులై వఱలుచుంద్రు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౦౬

యోగనిగ్రహంబున కీర్తివా రొక్క రిద్ద
ఱిదియు మందురు నిందుము కథలు కొన్ని;
వారె సర్వాత్మనా నీదు సౌరసులును
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౦౭

హరి కథలను వినుచున్న వారిలోను
గొందఱికి దాని విలువను గుర్తుపట్టి
సాటివారికి బోధింపఁజాలి యుంద్రు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౦౮

వారె యవతారపూరుషు లైరి, వారి
కథలు గాథలు మాకు వాఙ్మయము నయ్యె
నదియె మా సంస్కృతికి మూల మాయె మఱియు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౦౯

సాహితీసమరాంగణ సార్వభౌముఁ
డైన రాయలవారి పుణ్యానఁ దొల్లి
నీదు భక్తుని గాథ వింటిమిగదయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౧౦

నీదుశక్తి విభిన్నమై బోధపడక
భిన్నరూపంబులుగఁ గనిపింపవచ్చు;
వాని యునికి యెఱుంగుటే జ్ఞానమయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౧౧

నీదుభక్తుల మనుకొని వాదభేద
భావములతోడఁ జీకాకుపఱచి కాల
యాపనము చేయు టంత భావ్యంబు గాదు;
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౧౨

శివుఁడవో విష్ణుఁడవో బ్రహ్మ వవుదువేమొ
నాకుఁ దెలియవు నీ రూపురేక లేవొ !
అన్నిటికి మూల మొక్కఁడే యంచు నెంచు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౧౩

అన్ని రూపంబులందు నీ యమితశక్తి
యున్నదను భావ మొక్కటే యున్నదయ్య
దాని గుర్తింపఁగలుగుటే జ్ఞానమేమొ !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౧౪

శాస్త్రచర్చలు చేసి నిస్సారమైన
జీవభావమ్ము లోకవంకఁ బెంచుకొంచు
నొకరి నొకరు మనస్సు లొందనేల
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౧౫

నిన్నుఁగూర్చియె ధ్యానంబు లెన్నువారు
నాస్తికమనుజుని ద్రోహింపఁజాలరేమొ !
సామ్యవాదుల కిట్టిదే హేతువేమొ !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౧౬

నిన్నుఁ బూజించు మార్గమందున్న భావ
భేదమే పెద్ద వాదమ్ముఁ బ్రోదిచేసి
తికమక లొనర్చి యేదియుఁ దెలియనీదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౧౭

భావభేదంబు మిక్కిలి బలిసిపోయి
కట్టుబొట్టులలోసైత మెట్టి దశకు
దించెనో యెంచి చూచినఁ దెలియవచ్చు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౧౮

స్వామి! నీ కిచ్చు నైవేద్య భాగమందె
యెన్ని తీర్పులు చెప్పిరో యెవరి కెఱుక ?
అదియు నొక పెద్ద మతముగా నవతరించె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౧౯

పాపరహితుండు కంచెర్ల గోపరాజు
పరమభక్తాగ్రగణ్యుఁడై పాడినట్టి
పాటలే భక్తులకు రాచబాట లాయె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౨౦

ఆటపాటలలోన భద్రాద్రిరామ
మూర్తి మూర్తిని జిత్రించి పూర్వజన్మ
పుణ్యమున గోపరాజు సత్పురుషుఁ డయ్యె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౨౧

రాముఁడే దైవమని యుక్తి రాల నమ్మి
పాటలే కాదు నూరు పద్యములను
లోకులకు వ్రాసి యిచ్చి సుశ్లోకుఁ డాయె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౨౨

దాశరథి యను నామ మీ దేశమందు
రోళ్ళరోఁకళ్ళగా వేయినోళ్ళఁ బాడు
చుండుటకు మూల మాతఁ డొకండు కాదె!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౨౩

భక్తియను మంత్రమును భద్రపఱిచి గోప
రాజు, శ్రీరామమూర్తికిఁ బూజ చేసి
నాటివారికి మోక్షంబు చాయ చూపె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౨౪

ఆ మహాభాగుఁ డొసఁగిన రామమంత్ర
మీ జగంబునఁ బురుషార్థ మిచ్చునట్టి
దివ్యసాధన మయ్యెఁ గాదే తలంప
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౨౫

భద్రుఁ డే నాఁటివాఁడో యీ యద్రి కెప్పుడు
వచ్చి తప మేమి చేసెనో వసుధలోన
వారి కిర్వుర కున్న సంబంధ మేమొ!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౨౬

భద్రునకు నద్రికిని రామభద్రునకును
దివ్యగోదావరీప్రాంత దేశమునకు
నిట్టి పూజ్యత తెచ్చిన దెవరు స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౨౭

భవ్యగోదావరీతీర పరిసరములఁ
బర్ణశాలను సృష్టించి పరమపురుష!
దివ్యమహిమంబు మాకు నందించితీవు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౨౮

అప్పుడా పేదపడుచు 'దమ్మక్క' యనెడి
పుణ్యవతి రామచంద్రుని బూజ సేయఁ
గలిగెఁ జదువులు చదివియుఁగాదు స్వామి !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౨౯

తాటిపండ్లను భక్తి తాత్పర్యముగను
నిత్యనైవేద్యముగ నీకు నిర్ణయించు
కొనియెనఁట ! యామె పుణ్య మేమని వచింతు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౩౦

శబరికథకును దమ్మక్క చరితమునకు
నెట్టి వ్యాఖ్యానములు చేసిపెట్టఁగలము ?
వారి భక్తి ప్రపత్తుల దారిగాని
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౩౧

భక్తిభావంబు జెన్నొందువారి మదికి
భాగ్యభాగ్యంబు లేవియుఁ బనికిరావు
నీ ప్రేమయుంటె వారి కన్నిటిని గూర్చు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౩౨

త్యాగరా జేమి చెప్పి చేయంగ నేర్చె
గోపరా జేమి చేసి నిష్పాపుఁ డయ్యె
దాని గుర్తించువారైన ధన్యులయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౩౩

ఏ యుగంబున నెవ్వరే యే తపస్సు
చేసి రంచును గథ లెన్ని వ్రాసియున్న
ననుభవంబున గుర్తింప నయితి కాదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౩౪

నివురు గప్పిన నిప్పు గన్పింపనట్టు
నీదు భక్తులు పైకిఁ గన్పింపరయ్య
తగిన సమయాన వారి సత్త్వంబు తెలియు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౩౫

ముంచుకొని వచ్చు వర్షంబు పోల్కి నీతి
బాధలవి యెన్ని చీకాకుపఱుచుచున్న
నీదు భక్తులు ధీరులై నిలిచి యుంద్రు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౩౬

ముమ్మరమ్ముగ బాధలు క్రమ్ముకొన్న
కొలఁది నీ మీఁద భారము నిలిపి చిత్త
శాంతి నొందుట భక్తుల సహజగుణము
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౩౭

అంతవాఁడవు నీవు రవ్వంత కరుణ
చూపఁగా వారి బాధలు సురిఁగిపోవు;
వారిబాధలు నీకును బాధ లగునొ!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౩౮

నాదుభక్తుల కపకార మేదియేని
చేయరాదని నీవు శాసించియున్న
కథలు పెక్కులు కలవు వాఙ్మయమునందు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౩౯

చక్ర నేమిక్రమంబున జరుగుచుండు
జన్మమరణంబులందు నిస్సారమైన
వృత్తి కలవార లెట్టు తరింతురయ్య!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౪౦

అట్టి జన్మపరంపరలందు లేశ
మైన నినుఁగూర్చి నేర్చినయాతఁ డొకఁడె
తుదికి లాభంబు పొందుచు బ్రదుకనేర్చు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౪౧

ఆత్మకు వికాస మిచ్చెడి యంశ మేదొ
తెలిసికొనుటయె నరునకుఁ గలుగు ఘనత;
యితరజీవుల కట్టిది యెఱుఁగరాదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౪౨

జన్మములయందు నుత్తమజన్మ మొక్క
మానవునిదన్న పెద్దల మాటలోని
యంతరార్థ మెఱుంగుటే కొంత మెఱుఁగు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౪౩

ఈ ప్రపంచములో నేది యెవరి కెట్టి
మోదఖేదము లిచ్చునో మొదలె మాకుఁ
దెలియదాయెను; దానఁ జిక్కులును గలుగు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౪౪

తెలిసి చేసెడి తప్పులే కలవు మాకు
వాని సవరించుకొనుటయే జ్ఞాన మనియు
నెఱుఁగుదుముగాని యది యేమొ జరుగదాయె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౪౫

నిచ్చలును నీదుచింతన నిలుపుకొన్న
వాని కీ దోషములు చాలవఱకు రావు;
దానికోసమె జ్ఞాని సాధనము చేయు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౪౬

జ్ఞాన మను మాటకును నిజమైన యర్థ
మేదియో గాని తెలియక వాదులాడు
కొందు మిది యంతయును జూచు చుందువయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౪౭

పుణ్యపాపంబులయు పుట్టుపూర్వములను
మూలముట్టుగ గుర్తింపఁ జాలమయ్య
యేది నిర్ణయ మన్నదే యెఱుఁగలేము
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౭౮

ద్వంద్వముల సందడికి డిందువడక స్తిమిత
భావ మందెడివాఁడెపో ప్రాజ్ఞుఁ డరయ;
వాఁడె నినుఁ జేరఁగాఁ దగువాఁడు నగును
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౭౯

మనసు నిశ్చలముగఁ జేసికొనుచు నిన్నుఁ
గొలువనేర్చినవాని యే కోర్కెగాని
తీర్చి యతనికి సుఖము లందింతువయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౮౦

ఆ పరిస్థితి పొందినయాతఁ డెవఁడు
వేఱుకోరిక లేవియుఁ గోరుకొనఁడు
నీ ప్రమేయమె యతఁడు గణించుఁగాని
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౮౧

కోరికలు చంపుకొని నిన్నుఁగూర్చి నిర్వి
కారముగ ధ్యానమును జేయఁగలుగు శక్తి
యిత్తువా స్వామి! యింక మఱేది వలదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౫౨

అడవిలోఁ గూరుచుండి యే గొడవ లేక
ముక్కు మూసి తపస్సులో మునుఁగలేము
కొండపై నున్న నీవె మా యండ స్వామి !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౫౩

కొండలే నీకు నెలవుగా నుండి మమ్ముఁ
బైకి రప్పించుకొనుటలో భావ మేమొ !
చిద్విలాసమ్ము గాను నీ చేష్ట లన్ని
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౫౪

కొండ లెక్కియుఁ బడిగాపు లుండి నీదు
దర్శనమ్ములు పొందు విధాన మెల్ల
జపతపంబులవంటివే స్వామి ! మాకు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౫౫

నీకుఁ బరిసరమందు గణింపఁదగిన
పైరుపంటలు పండించువారు లేరు
నీకు నిలువెల్ల బంగారుపోకులయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౫౬

నిత్య నైవేద్యములు గాఁగ నీకు నొసఁగు
సర్వసంభారములు చూడ సంభ్రమంబు
నిచ్చుచుండు నపూర్వకోటీశ్వరుఁడవు
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౧౫౭

పాలకులు వారువము లందలాలు నీకు
నేనుఁగులు లెక్క లేదు లక్ష్మీశ్వరుఁడవు
నీదుభోగము వర్ణింప నేరమయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౧౫౮

భోగములలోనె వైరాగ్యయోగములును
బహుగుపేకలు గాఁగ నేర్పఱిచి చూపి
విస్మయానందములను గల్పింతువయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౧౫౯

నీదుసన్నిధిలో నున్న నిర్ణయములు
త్యాగరాజంతవానికే యోఁపినై చె
కాని, నీ వూఱకుంటివా వానిఁ బ్రోవ!
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౧౬౦

నిన్ను దూరాన నుంచి యే నెపమొ చూపి
చూపకున్నను భక్తుల చూపులకును
దూర మెన్నఁడు కావు విచారపడము
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౬౧

భక్తులకు నీకు 'నిస్తంత్రివార్త' లెపుడు
సాగుచుండునుగాదె నిశ్శబ్దముగను
లాఁతివారికిఁ దెలియ దా రీతి స్వామి !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౬౨

ఎవఁడు భక్తుఁడో ! కాఁడో ! వాఁ డేమి చేయఁ
జూచునో నీవు క్రొంటిలోనె చూడఁగలవు
నీదుసన్నిధిలో మోస మేది కుదురు ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౬౩

'జోగి' యను 'తంతు' పెట్టి యే భోగికైనఁ
గొంత మార్పును క్షణములోఁ గూర్పనేర్తు
వదియె యాతని కొక దివ్యయాత్ర యగును
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౬౪

విధినిషేధము లంచు నీ వివిధపూజ
లందు నర్థముగాని వెన్నైనఁ గలవు
కాని, యవి మాకుఁ బట్టింపు కావు తండ్రి !
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౧౬౫

మనసు కుదిరిక చిక్కెయు మాయమర్మ
ములును జూపక నీ పూజ సలుపువాని
కిత్తు వానంద మది కొంత యెఱిఁగి యుందు
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౧౬౬

చంటిపిల్లలుసైతము చంకలోనె
యుండియును నీమహిమ కుద్దండసాక్ష్య
మిత్తు రది కన్నులార నే నెఱిఁగియుంటి
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౧౬౭

కలియుగంబునఁ బ్రత్యక్షగాథ లెన్నొ
నిన్నుఁగూర్చి వచించిన వున్నవయ్యా
నీదుమహిమంబు, వానిలో బోధపడును
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౧౬౮

సాక్ష్యమది లేని దేదియు సరిగ విశ్వ
సింపఁజాలని లోకుల చిత్తమునకు
హత్తుకొనురీతి బోధింప వత్తువయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౬౯

లోకమున నున్న వింతలలోన వింత
లైన మహిమలు చూపించినావయ్య స్వామి!
యవియె మా చిత్తములఁ బట్టి యూపి యుంచు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౭౦

తెలుఁగు సంసారములలోనఁ బలువిధాల
నీదు సౌఖ్యము పెనఁగొని మోద మిచ్చు
చున్నదనుటకుఁ దార్కాణ మెన్నవలెనె!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౭౧

యాత్రలశ్రేణిలో నీదుయాత్రలకును
యాత్రికులలోను స్వామి! నీ యాత్రికులకు
హద్దుపద్దులు ప్రాముఁగా నలవి యగునె!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౭౨

ఎందుఁ జూచినఁ దిరుపతి యేఁగువారె
కానవత్తురు రేయుఁబగళ్ళుగూడ
వారి కెవ రేమి బోధింపవలసియుండు ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౭౩

పిల్లజెల్లలు కలసి యింటిల్లిపాది
మూటముల్లెలు గట్టి యారాటపడుచుఁ
గొండ యెక్కుట యెల్ల నీ యండకొఱకె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౭౪

కొండకొమ్మున కెగఁబ్రాఁకుచుండి భక్త
బృంద మనుచుండునట్టి గోవిందనామ
మెంత బల మిచ్చునో భక్తుఁడే యెఱుంగు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౭౫

తిండితిప్పల జోలి యేదియును లేక
నిన్ను దర్శించు టొక్కటే నియమ మంచు
నెంచి నీ మూర్తి గాంచి తరించు స్వామి !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౭౬

వారమని వర్జ్యమని యడ్డవాట్లు వేయు
వారు లేరయ్యా నీ పూజ కోరువారు
నిచ్చలును నీదుకొలువు కన్పించునయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౧౭౭

నీ ప్రభుత్వములో నుండి నీదుసేవ
చేయ నోఁచినవానిదే జీవితంబు
వాఁడె ధన్యాత్ముఁ డన్నింట వసుధలోన
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౧౭౮

వందలును వేలు గైకొనువారు నీదు
కొలువులో జీతములకును గుదిరి యుంద్రు
వారు రెండింట లాభాలవారు గాదె !
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౧౭౯

తీర్థమును స్వార్థమును సరితీర్చుకొంచు
హాయిగా నీదుసేవలో నాదమఱచి
పున్నము గడించువారె సత్పురుషులయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౧౮౦

లోకు లిచ్చెడి కానుకలోను దాను
గొంత 'కైంకర్యమును' జేయఁ గోరువాఁడు
వంశనాశనమును గోరువాఁడె యగును
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౮౧

అంతటి ప్రభుండవయ్యు నీ యంతికమున
దోషములు చేయువారి కేదో విపత్తు
చూపి భయపెట్టి కరుణను జూపువయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౮౨

చేసియున్నట్టి తప్పులు చిత్తశుద్ధి
కుదిరి వెలిఁబుచ్చువానికిఁ గొంత కరుణ
పంచి యిచ్చెదవఁట నీవు పరమపురుష!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౮౩

క్షేత్రమహిమనుబట్టి స్వశ్రేయ మెంచి
యాత్రికులు నిన్ను దర్శింప ననుదినంబు
వచ్చిపోదురు నీ వెంతవాఁడవయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౮౪

‘సుప్రభాతము’ మొదలుగా సూర్యుఁ డస్త
మించునందాఁక నీ కొల్వు కొంచెమేని
యెడ తెఱపి యన్నమాటయే యెఱుఁగదయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౮౫

వేఁగుజామున లేచి వేవేగ నీదు
భోగములలోనఁ గొంగ్రొత్త పోకడలను
జూపి యూరింతువయ్య నిన్ జూచువారి
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౮౬

నిత్యకళ్యాణముగ స్వామి! నీదుమూర్తి
యెల్లవేళల నంతాలు కొల్లగొంచుఁ
గన్నులకు విందులను గూర్పఁ గడఁగుచుండు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౮౭

ఒంటినిండుగ నగలు పెక్కింటిఁ బెట్టి
కొంచుఁ గులుకుగ మురిపము గూర్చుచుందు
వెంత మాయలమారి శ్రీమంతుఁడవుర
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౮౮

మేల్మిబంగారు తొడువులో మెఱయు దివ్య
మూర్తివై, భక్తకోటి కపూర్వవేష
మిత్తువేమయ్య నీ మాయ యెట్టిదయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౮౯

స్వామి ! నీ బేరమున 'లాభసాటి' గాని
దేదియును లేదు; నీవు కన్నెత్తి చూడ
'సంచిమొద' లట్టె పెరిఁగి లాభించుచుండు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౯౦

ఐహికంబులలోఁ బారమార్థికంబు
పొదివి పొలుపుగ జ్ఞానమ్ము బోధసేయు
కలియుగపుదైవమవు నీవు కమలనయన !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౯౧

ఏది వ్రాసినఁ జదివిన నీదుమూర్తి
కన్నులకుఁ గొట్టవచ్చిన ట్లున్న దేమి !
యైంద్రజాలికవిద్య యేదైనఁ గలదొ !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౯౨

ఈ ప్రసంగంబులోఁ గల మెత్తి వ్రాయఁ
బూనినప్పుడ యుత్సాహ బుద్ధి పొడమి
యొడలు సివమెత్తి యేమేమొ యుద్భవించు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౯౩

ఆర్షగ్రంథాలలోని వేదాంతసూక్తు
లెత్తి నిను నేఁను వర్ణింప నెవరితరము ?
స్వామి ! నీ శక్తి కొలతకుఁ బట్టునయ్య ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౯౪

మాయ వచ్చిన మార్గాలె నీకు నన్వ
యించి యేమేమొ నిన్ను వర్ణించుకొందు
మిట్టి యనుభూతిఁ దెలుప నా కిచ్చుటకును
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౯౫

కవితలోఁ జూర్చి స్వామి ! నీ ఘనత విప్పి
చెప్పవలె నని యుబలాట మెప్పు డుండుఁ
గాని విశ్రాంతి కుదురదు కర్మ మేమొ !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౯౬

క్రమముగా నీవు 'చలన చిత్రముల' కెక్కి
సైత మూరూరఁ దిరిగి యుత్సాహ మిత్తు
వవుర నీ చేష్ట లేమని యభినుతింతు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౯౭

కోట్లకును గోట్లుగా జతకూర్చి పేర్చి
యెల్లసొమ్ములు మఱల మా కిత్తువయ్య
స్వామి! నీ పేరుఫలముల సార మేమొ!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౯౮

అఖిలభారతవిఖ్యాతి నంది, వేల్పుఁ
బెద్ద వయి పెద్ద గడనకుఁ బేరు వడితి
విట్టి నినుఁ బొట్టిమాటల నెట్లు కూర్తు?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౯౯

ఎవని కెయ్యది ముఖ్యమో యెఱిఁగి వాని
కది లభించెడి మార్గమే యందఁజేసి
మైకమునఁ బెట్టి యాడింతువే కదయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౦౦

నిత్యనూత్నంబుగా స్వామి! నీ కొసంగు
భోగములు చూడ దేవేంద్రభోగము లగు
నీదువైభవ మెట్లు వర్ణింతునయ్య!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౦౧

కొండపై నీవు నీ భక్తు లుండుటకును
స్థిరనివాసమ్ము లెన్ని సృష్టించి యున్నఁ
జాలకున్నవి నిన్నసఁజాలమయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౦౨

నిన్న మొన్నటివాఁడవా! నీ వయస్సు
నిర్ణయము చేసి యెవరు వర్ణింపఁగలరు!
ఆదిమధ్యాంతశూన్యుఁడ వండ్రు నిన్ను
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౦౩

'మంత్రపుష్పంబు'లో భవన్మహిమ యనెడి
మధువు గ్రోలెడి భక్తసమాజ మెంత
ధన్యమో విప్పి చెప్ప నా తరము గాదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౦౮

ఎన్ని యభిషేకములు నిత్య మెన్ని యుత్స
వములు బ్రహ్మోత్సవంబులు స్వామి! నీకు
జరుపుకొనుచుంద్రు భక్తు లుత్సాహపడుచు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౦౯

నిన్న చేసిన వేడుక నేఁడు మఱలఁ
గ్రొత్తదనమును కూర్చి మా కోర్కె తీర్చు
నదియె నీ రూపులోని మాహాత్మ్యమయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౧౬

ధనము విద్యయుఁ గలిగిన మనుజులైన
నీకు 'దాసానుదాసు'లే నీరజాక్ష!
నీవు దాసుని చేతిలో నిలుగవయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౦౭

నీవు బ్రహ్మాండభాండంబు నిండి యుండి
కడుపులో సర్వమును దాఁపఁగలవు స్వామి!
యెవరి కే రీతి నాధార మెవరొగాని
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౦౮

పంచభూతాత్మకంబౌ ప్రపంచమందు
నీదునంశము దండిగా నిండి యుండు
నా రహస్యము జ్ఞానికే యర్థ మగును
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౦౯

ఎన్ని యుగములు చన్న నీ యెఱుక గొన్న
వారు వ్రేళ్ళకు లెక్కకు వస్తురేమొ!
వారి లోకము నిలిపినవారు స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౧౦

ఎఱిఁగియుండియు నీ మూర్తి యిట్టిదనుచు
నితరులకు బోధ సేయఁగా నెవని తరము?
మాట లవి చెప్పి యేమేమొ వాగుఁగాని
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౧౧

జగము లన్నియు నిండిన స్వామి! నిన్నుఁ
బాగుగ వలెనన్న సాధ్య మెప్పుడును గాదు;
కాని, నేనిక విప్పి చెప్పఁగలము కొంత
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౧౨

అక్కఱకు రాని పనులలోఁ జిక్కిపోయి
యొక్కనాఁడేని నినుఁగూర్చి యొక్క నిమిష
మైన యూహించి గుర్తింపనైతి స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౧౩

కాల మిప్పటికే చాలఁ గడచిపోయె
నొడలు జవసత్త్వములు తగ్గి బడలుపడియె
మనసు కుదిరిక చిక్కదు మార్గ మేది?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౧౪

ఎన్ని లక్షలు గడియించి యెన్ని మెట్ల
కెక్కియున్నను నీ ధ్యాన మెఱుఁగనట్టి
వాఁడు లెక్కకు రాఁడు నీవాఁడు గాఁడు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౧౫

నీవు కరుణించి యిచ్చిన వేవియేని
నీకు నర్పించుకొనుటయే మాకు మేలు
కాని, గుర్తింపలే మిట్టి జ్ఞానపథము
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౧౬

ఆస్తిపాస్తులే మాకు సౌఖ్యములు గూర్చి
పెద్దగద్దెను దెచ్చి యిప్పించు నంచు
నెంచి నీ మాటయే స్మరియింపనైతి
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౧౭

తెలిసివచ్చినపిదప బుద్ధియును గుదురు-
పాటునకు రాదు లౌకిక బాధ లేవొ
ముంచుకొని వచ్చి మమ్ము సమ్మోహపఱచు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౧౮

చేతికిని జిక్కియున్న యాస్తిని వ్యయమ్ము
చేసి యావల దుఃఖించు చెనఁటివోలె
వయసు గడపియుఁ దుదకు దుర్బలుఁడ నయితి
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౧౯

బలము గలిగిననాఁడె నీ ప్రాభవంబు
చవియుఁ జూసించి యున్నచో స్వామి! నేఁడు
నేను నీ భక్తకోటిలో నిలిచి యుందు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౧౦

తెలియు ననుకొని యిన్నేండ్లు కలలు గనుచుఁ
దిరిగితిని 'దీక్ష' రవ్వంత తెలియవచ్చు
వేళ కే విఘ్నములో యడ్డుపెట్టుచుండు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౧౧

వయసు చెల్లినదాఁక నీ శాస్త్ర మెఱుఁగ
లేనివాఁ డిల భక్తియు లేనివాఁడె
గతముఁ గూర్చి స్మరించినఁ గలదె ముక్తి ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౧౨

ఇంట నొంటను గల సత్త్వ మింకిపోయి
పనికిమాలిన దుర్దశ పట్టినపుడు
నిన్ను గుర్తింప మనసును నిలువఁబోదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౧౧౩

నిర్గుణుండ వటంచు వర్ణింపఁబడియు
స్వామి ! నీ పెట్టు మమ్ముఁ గాపాడఁగలవు ?
కరుణ, గుణమని పెద్ద లందురు గదయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౨౮

వైదికంబయి వెలయు నీ వైఖరికిని
భువిని గసపించు నీకు నే పోలికయును
గానరా దది ; దాని కే కారణంబొ !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౨౯

వరము లొసఁగియు భక్తులవలన మెప్పు
గాంచితివి మున్ను , నేఁడు మా కంటియెదుట
నెన్ని ఘోరకృత్యములు పుట్టుచున్నవయ్య !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౩౦

ప్రకృతిపరిణామసూత్ర మీ పట్టునందుఁ
గాంచవచ్చుట నిజ , మది కానినాఁడు
జపతపంబులఁగూర్చి విచార మేది ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౩౧

రాజకీయపు గొడవల రాయిడికిని
నలఁగి కొంపలు నీదుకోవెలకు వచ్చి
చిత్తశాంతిని బొందుట చిత్రమయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౨౮

వక్రమార్గములోన వ్యాపారసరణి
మేపుగాఁ బెంచి యుండి నీ ప్రాపు గోరి
వత్తు రది యేమిస్వామి! నీ భయము కలదా !
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౨౨౯

ఎవని కేది మనస్సులో నిష్ట మగునో
సూక్ష్మదృష్టిఁ బరీక్షించి చూడఁగలవు
నిన్ను వంచించు ప్రాణి యెందున్నదయ్యా ?
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౨౩౦

మే మొసంగెడి జోతలు స్వామి ! నీకుఁ
గడుపు నిండించు నని నమ్మి కాదు; మాకుఁ
దోఁచినది యంతవఱకె యేదో విధంబు
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౨౩౧

విశ్వమయుఁడవు కాన నీ విశ్వమందు
నేది యిచ్చిన నీకు సంతృప్తి యగునో
యది యెఱుంగుట యే పరమార్థమయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౧౩౨

భౌతికంబుగ మే మిచ్చు వస్తువాహ
నములు నీ తృప్తికోస మెన్నఁటికిఁ గావు
లాంఛనంబుగఁ గోరెడి వాంఛ లేమొ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౩౩

ధనము ధాన్యము లిచ్చి కైకొనుట కొక్క
వస్తువవు కావు నీ చిత్రపటమువఱకె
విలిచి తెచ్చి ముదంపడఁగలముగాని
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౩౪

నీదునాకృతి యసి మేము నిర్ణయించు
కొన్న చిత్రపటంబె మా కన్నులకును
విందు లొనరించు సందియ మంద నేల?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౩౫

విగ్రహారాధనముఁగూర్చి వింతలైన
హేతువాదము లొక లక్షయేనిగాని
నీ ప్రసంగంబులో నాకు నిలువలేదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౩౬

నిన్ను నీ శక్తి సూచింప నేర్చియున్న
దారికన్నను హేతువాదాల దారి
నాకు నచ్చదు నా దారి నాదిగాని
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౩౭

నాకు నీ దారి చూపి వితాకు తొలఁగఁ
ద్రోసియున్న మనీషుల త్రోవఁగానె
వెలుఁగు గలదని నేఁటికిఁ దెలిసికొంటి
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౩౮

వాదమున నిన్నుఁ దూర్చి దౌర్భాగ్యమైన
చర్చలకు దారి చూపఁగాఁ జాలనయ్య
నమ్మితిని జాలు నా హృదయమ్ములోన
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౩౯

'ముద్రశుద్ధి'గ నిన్ను నా బుద్ధిలోనఁ
దలఁచి యాత్మకు హత్తుకోవలయునంచు
నెంచితిని దానికొఱకుఁ దపించుచుందు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౮౦

శాస్త్రములు సంప్రదాయవిచారసరణి
యన్వయించి భవన్మూర్తి కర్చ లొసఁగు
వారి భాగ్యమె భాగ్య మిన్వసుధలోన
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౮౧

కోవెలను సృష్టి చేసి నీకొఱకుఁ గొన్ని
విధినిషేధము లేనో కావించుకొందు
మింతలను నీదుశక్తి మా కేమి తెలియు ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౮౨

ఆనుపూర్వకన్నను స్వల్పభేద మగుచు వంద
నెంచెదము గాని, నన్ను గుర్తించు మార్గ
మేదియో మాకు నగాదిగా బోధపడదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౮౩

వేషములు భాషలును వేనవేలు వాడు
కొనుట నేర్చుకొన్న నీకొఱకుఁ గొంత
కృషి యొనర్చి సాధించితిమి పలుకరాదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౪౪

నేఁటి చదువులు నిజముగఁ గూటికొఱకె
యంచు ననుభవమందుఁ గన్పించునయ్య
వానిలో నిన్నుఁగూర్చి రవ్వంత రాదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౪౫

చదువునకు విద్యకును నేఁడు చాల భేద
మున్న దనుటకు హేతువు లెన్నొ గలవు
విద్య గలవాని వైఖరి వేఱె యుండు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౪౬

విద్యకును జ్ఞానమునకు నభేదభావ
మున్నదని శాస్త్రములు చెప్పి యున్నవయ్య
జ్ఞానికిని నీకు లంకెయుఁ గలదుగాదె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౪౭

ఓనమాలను దిద్దుటలోనె నీదు
జ్ఞాన 'మోంకార' రూపానఁ గఱపుచుండ్రు
శిష్టమార్గములోని విశేష మదియె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౮౮

పారమార్థికచింత నిండారఁ దోణఁకు
చదువులే పూర్వులకు మంచి చదువు లాయె
వారికాలము తత్త్వ మా తీరు గడచె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౮౯

ధనమునకు నున్న మహిమ యింతని వచింప
లేక దానికె ముగ్ధులై క్లేశపడుచు
నుందు రేగాని జ్ఞానము నందుకొనరు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౯౦

చదువు లన్నియు నేఁడు సంసారబాధ
లుద్భవడిఁ దెచ్చి పోషించుచున్నవయ్య
వానిలో నున్న లోపమే కానలేము
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౯౧

త్రోవఁ బోవుచు ఱాయి యేదో బుజాన
నెత్తుకొని బాధపడినట్లు లీ 'తతంగ'
మెత్తుకొని యేమి తెమలక చత్తుమయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౫౨

దారిఁ బోవుచు బురదలోఁ జాఱిపడిన
యర్భకునిరీతిఁ జదువులయందు నేఁడు
మునిఁగి చీకాకుపడుటయే ముచ్చటాయె
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౨౫౩

మాకుఁ జదువులలో నున్న మర్మమేదో
విప్పి చెప్పెడి రోజులే వెనుకపడియె
నీదువృత్తాంత మెచ్చట నేర్పిరయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౨౫౪

అడ్డమైనట్టి యధికారి కణఁగి మణఁగి
చేతు లెత్తుట లౌకికనీతి యాయె
నెవఁడు సర్వాధికారియో యెఱుఁగలేము
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౨౫౫

బుద్బుదప్రాయమైన యీ పుట్టువునకు
మూల మెక్కడఁ గలదో మా బుద్ధి కేల
తెలియఁజేయవు గగ్గోలు లెత్తు వేళ?
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౨౫౬

అల్పబీజంబులో గుప్తమైన ఫలము
నుంచి లోకంబులో నుపయోగమునకుఁ
దెత్తు వా ధోరణియె మాకుఁ దెలియదయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౫౭

చేఁదులోఁ దీపి కలిపి విశేష మేదో
గర్భితంబుగఁ గావింపఁగలవు స్వామి!
నీ విలాసంబు లెన్ని వర్ణింపఁగలము?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౫౮

కాలకూట మొసంగి యక్కడనె యమృత
భాండమును దించి యిచ్చి సంబర మొనర్చి
నాఁడ నీ వెన్ని మాయలవాఁడవయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౫౯

నీదు చేష్టలు కరుణతో నిండియుండి
దురవగాహంబులుగ మాకుఁ దోఁచుఁ; బిదప
వానిపై చర్చలకు దిగవలసివచ్చు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౬౦

దేశములలోని సాంఘికస్థితులె యొకరి
కొకరి కర్థంబు గాక యెన్నో యనర్థ
ములను గల్పింప నీ శక్తి బోధపడునె ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౬౧

నీ యనంతమహాసృష్టి నియమములను
లేశమైన నెఱుంగఁగాలేనివాఁడె
వారు-వీరని భేదభావములు చూపు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౬౨

ఏది నీచ మటంచు మే మెంచుకొందు
మదియె యాదివరాహంబు నయ్యొ స్వామి !
అందు గూఢార్థమును దాఁచి యుందువయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౬౩

మహిని గులములు జాతులు మతము లంచు
లౌకికంబుగ నున్న యీ సాకు లెల్ల
నీకుఁ బట్టవు సర్వము నీదెగాదె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౬౪

కులము తక్కువ యని భ్రాంతి కలుగఁజేయు
కులములో జన్మ మెత్తి నీ బలము చూపి
నాఁడ వీ భేదములె నీకు నచ్చవయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౬౫

నిర్గుణుండవు నీవు జన్మించు జన్మ
మేదియును వంశగౌరవ మీయలేదు
గుణమునకె గౌరవము చూపఁగోరుఁగాని
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౬౬

వాఙ్మయములో విచిత్రమా వ్రాఁత లెన్నొ
నీకు సైతము కులమును నిర్ణయించి
భ్రాంతి గల్గించునవి కానవచ్చుచుండు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౬౭

నీ దయ కనర్హమైనది యేదియేని
ప్రాణికోటిని లేదని పలుకు మాట
పాటి సేయుటయే మంచిబాట మాకు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౬౮

కాళమే గాదు హస్తియుఁ గాదు శ్రీయు
భక్తి చూపించి ముక్తిని బడసినట్టి
గాధ లన్నియుఁ జెప్పెడి బోధ లివియె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౬౯

పరమపాతకిసైతము కరుణ గోరి
యాశ్రయించిన, దోషము లన్ని సైఁచి
కాచితి వటంచుఁ జెప్పిన కథలు గలవు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౭౦

సాంఘికంబుగ వెలయు సంస్కార మింత
యంటఁగా నోఁచుకోనని యే వ్యక్తియైన
నీకు దూరము కాఁబోఁడు నిశ్చయంబు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౭౧

అంగడిని సర్వ ముండియు నల్లునోటి
కేదియును రానిరీతిగ, నెవని కవని
నెంత దూరాన నుందువో యెఱుఁగలేము
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౭౨

నిష్క్రియుఁడ వంచు నిన్ను వర్ణించు శ్రుతుల
కర్థ మిది యని చెప్పి వాచ్యంబు చేసి
యన్వయింపను బొత్తిగా నఖితి కాదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౭౩

స్వామి! యీ కానవచ్చెడి జగము లన్ని
నీ విభూతిని సూచింప నేర్చియుండుఁ
బ్రతిపదంబును నీ శక్తి వ్యక్త మగును
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౭౪

చీమయైనను గోరిన దేమొ తెలిసి
దాని మన్నింతువఁట నీదుతత్త్వ మిట్టి
దనుచు గుర్తింప మాకు సాధ్యంబు కాదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౭౫

దండము కమండలువుమాత్ర ముండి నీదు
సన్నిధిని గూర్చలేవు నిస్సంశయముగ
భక్తి యను దారి చూచుకోవలెనుగాని
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౭౬

నీది యే జాతి కులమని కాదు మమ్ము
నీవు ప్రశ్నించునది; యోయి! నీవు చేయు
మంచిపని యేది యను ప్రశ్నమాత్ర మేమొ
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౨౭౭

నీదునామము ధ్యానించు నియమ మున్న
వాని హృదయానఁ గల్మష భావ మసలు
నిలువ నేరదు శాంతియే నిలిచి యుండు
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౨౭౮

స్వామి! నీ నామ మను మహీజమును హృదయ
కుహర మను క్షేత్రమునఁ బాదుకొలిపి, భక్తి
క్రమ్మరించినవారిదే సుమ్ము ముక్తి
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౨౭౯

స్వామి! నీ నామమును విన్నవాఁడు, గ్రుడ్డి
వాఁడె కావచ్చు వాని కివ్వసుధలోన
దారి తప్పక దొరకియే తీరునయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౨౮౦

వట్టిమాటలు పలికెడివాని కెపుడు
స్వర్గమును గట్టఁబెట్టవు స్వామి !, నీకు
నతని యాంతర్య మప్పుడే యర్థ మగును
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౮౧

కట్టెలో నగ్ని యిమిడినకరణిఁ బాల
లోన దాఁగిన వెన్నవిధాన నీదు
జ్యోతి సర్వత్ర కానవచ్చును గదయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౮౨

ఎన్ని యుపదేశముల నెవ్వ రెట్లొనర్చి
యున్న నీ భక్తి యొక్కటి యున్నఁగాని
ఫలము పొందంగ నేరరు పరమపురుష !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౮౩

నీవు సత్యము జగము లన్నియును మిథ్య
యనెడి వేదాంత మెవ్వాని కర్థ మగునొ
వాఁడె నీ భక్తుఁడగువాఁడు వసుధలోన
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౪

తత్త్వశాస్త్రము సర్వము తఱచి చూడఁ
గలదు పరతత్త్వ మంచు నొక్కటి జగాన
నదియె నీ రూపు; పేరు లెన్నైనఁగాని
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౫

తత్త్వదర్శనమే జీవితమున కున్న
ధ్యేయ మని యెవ్వఁ డాత్మలోఁ దెలిసికొనునొ
వాని కేదైన మార్గము కానవచ్చు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౬

జ్ఞానమునుగాని భక్తినిగాని సాధ
నంబుగాఁ జేసికొని తరుణంబులోనఁ
దగిన కృషి చేయువారలే ధన్యులయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౭

ఇష్టదైవ మదెవ్వరో యెఱుఁగలేక
పేరు లేవేవొ పల్కుచు భేదభావ
ములను వెలిఁబుచ్చుచుందుము మోహమునను
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౮౮

గమ్య మొక్కటియే యన్న జ్ఞాన మింత
తెలియ కే వేవొ దారులఁ దిరిగి తిరిగి
భ్రాంతి వడి యాఁగిపోదుము పరమపురుష!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౮౯

తాను జేసిన కర్మంబు తనదు సర్వ
జన్మముల కంటుకొని కొనసాగుచుండు;
నదియు నీ తత్త్వమం దొక యంశమయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౯౦

ఏది యేమైనఁ 'బ్రారబ్ధ' మెవఁడు గాని
యనుభవింపక తీఱ దీ యవనిలోన
నది యెఱింగినవాఁడె నిన్నాశ్రయించు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౯౧

నీదు కరుణామృతంబు పొందెడు నదృష్ట
మే లభించినచోఁ గొండ యెక్కినట్లు
కులికి కూర్చుందు నా కేమి కొఱత స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

చ-౨

అప్పు డీ తత్త్వశాస్త్రసిద్ధాంతచర్చ
లేవియును నాకుఁ బట్టవు నీవుమాత్ర
మొక్కఁడవు చాలు, నీ భక్తి యున్నఁ జాలు
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

చ-౩

తత్త్వ శాస్త్రము చదివి నీ దారి యెఱిఁగి
ముక్తి పొందుటకన్న నీ భక్తి కుదిరి
చిత్తశుద్ధి గడించుటే శ్రేయమయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

చ-౪

నీవు ప్రేమస్వరూపివి నీదు భక్త
బృందమును ప్రేమబంధమం దుందురయ్యా
యిర్వురకు నున్న బాంధవ్య మిదియెగాదె
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

చ-౫

మంచినడకకుఁ దోడు నమ్మకము కుదిరి
నీదుశక్తిని గుర్తింప నేర్చువాఁడు
భక్తుఁడై ముక్తియం దనురక్తుఁ డగును
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

— ౨౬ —

ఎవని కేకాగ్రతయు ధ్యాన మిట్టి సుగణ
గణము లలవడు వాఁడు నీ జ్ఞాన మెఱుఁగఁ
గలఁడు మోక్షము చవి చూడఁగలఁడు స్వామి !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

— ౨౭ —

నెమ్మనమ్మున నిను నమ్మి నిలుపుకొన్న
మానవున కెట్టి గౌరవమైనఁ గూర్తు
వదియె నీ గాథలందు మా కర్థమాయె
వేగ రావయ్య తిఋమల వేంకటేశ !

— ౨౮ —

ఈ యనంతమహాసృష్టి కేది మొదలో
ప్రాణికోటుల సంఖ్య యే పాటిదియునో
లెక్క కట్టెడివారలే లేరు స్వామి !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

— ౨౯ —

నిన్ను గుర్తించు త్రోవలో మున్ను చెప్పి
యున్న సూత్రాలకన్న వేఱొకటి నేఁడు
మిన్నయైనది కానరాకున్న దేమి !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

300

ఆ మహర్షులు చెప్పిన దర్థమైనఁ
జాలునన్నంత నీరసస్థాయి కిపుడు
వచ్చితిమి నీకుఁ దెలియనివారమయ్యా ?
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

301

ఎన్ని చిత్రవిచిత్రంబు లెన్ని క్రొత్త
ఘట్టములు చూచుచుందుముగాని నీదు
వైభవంబు నిరూపించువారు లేరు
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

302

నిత్యమును నిన్ను నమ్మి ధ్యానించు శక్తి
యెవఁడు గడియించునో వాని కెట్టి భయము
కలుగనీయక కాపాడఁగలవు స్వామి !
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

303

వట్టిచేతుల నిఱుపేదవలెను గాన
వచ్చినను నీదుభక్తునివద్ద మహిమ
దాఁచిపెట్టెదవయ్యా నీ తత్త్వ మదియె
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౩౦౪

భక్తుఁ డొక్కఁడు తన కున్న శక్తి వలన
వేలతరబడి జనము నుద్వేగపఱిచి
నీదు ననుయాయులుగఁ జేయ నేర్చునయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౦౫

సిద్ధపురుషులు కర్మప్రసిద్ధమైన
వింతలను జూపి నీ శక్తి కొంతయైన
మాకుఁ జవిచూపుచుందు రీ లోకమందు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౦౬

నిన్ను గుర్తింపకుండుటే నిరయ మనియు
నిన్ను గుర్తించి మెలఁగుటే నిత్యసౌఖ్య
మిచ్చు స్వర్గంబు ననియు మనీషు లంద్రు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౦౭

నీ ప్రమేయము లేని మానిసికి నెంత
వైభవం బున్న లక్ష్య మెవ్వనికి నుండు ?
నీ ప్రమేయమె మమ్ము మన్నించునయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౦౮

రాజమార్గము వీడి పరాకు పడుచు
సందుగొందులఁ దిరిగిన చందముగను
నిన్ను విడనాడి యేదియో నేర్చినాఁడ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౦౯

భక్తియోగము జ్ఞానసంపాదనమున
మంచిసాధన మని పూర్వు లెంచుకొనిరి
దానిచే నిన్నుఁ గనుగొనుదారి దొరకు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౧౦

దాస్యభావము సఖ్య మేతాదృశములు
బంధములు చేసికొని నీదు భక్తబృంద
మెంతయుఁ దరింతు రిది యొక వింత త్రోవ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౧౧

ఆత్మ యన్నను భగవంతుఁ డన్న బ్రహ్మ
మన్న నొక వస్తువుగఁ బెద్ద లందురయ్య
యవియు మూఁడును నీవని యన్వయింతు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౧౨

అనుభవము లేని పాండిత్యమును గడించు
నతఁడు రాణింపనేరఁ డియ్యవనిలోన
వట్టిపోయిన యావెట్టు పనికివచ్చు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౧౩

సాధుసంసర్గ మన్నది చాలవఱకు
నీదు విజ్ఞానమునకు సన్నిహిత మగును
నిన్ను గుర్తించు దారు లెన్నెన్నొ గలవు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౧౪

ఎందు నే మున్నదో లోకమందుఁ దెలియ
సాధ్యమే గాదు; నీ భక్తజనముమాత్ర
మట్టి గుర్తించి నినుఁ గనిపెట్టునయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౧౫

తీర్థయాత్రల ఫలమది తెలిసి యెవఁడు
నిన్ను సేవించునో వాఁడె నిబ్బరముగ
నీదు మహిమను గుర్తింప నేర్చునయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౧౬

నేను నేనన్న శబ్దము దేని కన్వ
యించునో మూల మెఱిఁగి వర్తించువారె
నిన్నుసైతము గుర్తింప నేర్తురయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౧౭

తనువు జాఱిన వెనుక నెవ్వనినిగాని
వానిధర్మమె వచ్చి కాపాడుచుండు;
నాలుబిడ్డ లిఁకెవ్వరు నాదుకొనరు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౧౮

స్వామి ! నీ భక్తిసామ్రాజ్య వైభవంబు
చవి యెఱింగినవారికి స్వర్గ మేల ?
సత్యలోక మదేల ? యైశ్వర్య మేల ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౧౯

భవ్య భవదీయ భక్తి సౌభాగ్య మింత
కనికరింతువయేని యే కష్టమైనఁ
గష్టమేయైన సైఁపఁగాఁ గలము స్వామి !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౨౦

కర్మమునుబట్టి జన్మము కలుగునన్న
సూ_క్తిలోఁ బెద్ద యర్థమే యుండవచ్చు
దాని గు_ర్తించి నడుచుటే ధర్మ మగును
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౨౧

నీవు మా డెందములయందె నిలిచి యుండి
మా పొనర్చెడి కార్యకలాపములను
గాంచెదవు గాన నీకు భాగంబు గలదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౨౨

మాయకును లోఁగి వివిధజన్మములలోనఁ
బుట్టి దుర్వాసనలతోడ గిట్టుచుండు
సర్వజీవులఁ గాపాడు స్వామి నీవె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౨౩

నీవు కనుఱెప్ప తెఱచిన నిమిషమందె
జగము లలవోకగా సృష్టి యగును ; నీవు
కన్ను మూసినఁ బ్రళయమే కలుగునయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

రాజ

౩౨౪

భక్తి నీయెడఁ గుదిరెడివఱకు మేము
కులము గోత్రంబు భేదంబు కోరుచుందు;
మవల రవ్వంత మా కవి యంటఁబోవు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౨౫

దేహ మని యాత్మ యని మదిఁ దెలియలేక
మాయలోఁ బడి దుర్వ్యవసాయమందె
యఱఁగి మఱఁగి ప్రవర్తింతుమయ్య స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౨౬

ఎట్టి జన్మము నీవు నా కిచ్చియున్న
నీ ప్రమేయ మెఱుంగఁగా నేర్తునేని
బాధపడనయ్య యిదియె నా ప్రార్థనంబు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౨౭

నిన్ను వేధించి భాగ్యంబు లెన్నొ కూడఁ
బెట్టుకొని మైకమున నిన్ను విస్మరించు
దుర్గతికిమాత్ర మింక నన్నుఁ ద్రోయవలదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౨౮

కాంతలని కాంచనంబని యెంతదాఁక
లోకమునఁ జూపుచుందు వందాఁక మాకు
నీ ప్రమేయమె రక్షగా నిలుచుఁగాక
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౨౯

నీదుజోలికి మమ్ము రానీయనట్టి
వింత మోహమ్ము లెన్నొ సృష్టింతువేల ?
అదియె నీ మాయ ; యజ్ఞత యదియె మాకు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౩౦

ఎఱుక లేనంతదాఁక నే వేవో గాథ
బంధములు చుట్టుముట్టి పైపడుచు మమ్ముఁ
గుదిపి కూలార్చి బెడద చేకూర్చుచుండు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౩౧

సారహీనంబునైన సంసారఘోర
కూపమున మున్గి పాపంబు కూడఁబెట్టు
జనుల కెయ్యది రక్ష నీ స్మరణ తక్క
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

33౨

ధనము నిత్తువు కూర్తు వంచును దలంచి
నిన్ను ధ్యానింపనొల్లను నీరజాక్ష!
నాకు నక్కఱ యేదియో నీకుఁ దెలియు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

333

నీ మధురదివ్యనామమే నిత్యగాన
మగును భక్తుల కెల్ల రమాధినాథ!
వారె పూజ్యులు నీ తరువాత మాకు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

33౪

స్వామి! భవదీయసత్కథాసాగరంబు
తఱచి చూచినవారి కెవ్వరికిఁ గాని
కల్పవృక్షము లెన్నేని కానవచ్చు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

33౫

నీదు నవతారములను గణింప వ్రేళ్ళు
చాలు; మాకన్ననో కోట్లసంఖ్య పట్టు;
నెవరి దాయాసమో స్వామి! యెఱుఁగవయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౩౬

ఎన్ని జన్మంబు లెత్తిన నేమి మమ్ము
లెక్కకును దెచ్చువారలు లేరు స్వామి!
నిన్ను నెలుఁగెత్తి లోకముల్ సన్నుతించు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౩౭

ఆపదలఁ జిక్కి మ్రొక్కియు నాదమఱచి
మ్రొక్కు చెల్లింప నేరని యుక్కివులకుఁ
జిక్కుఁ గల్గింతు వది యొక శిక్షయేమొ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౩౮

మ్రొక్కులకు నిచ్చు లాభము లొక్క ప్రక్క
దోషముల కిచ్చు శిక్షలు తూచి చూచి
నిన్ను నీ శక్తి నూహింతు నిగమవేద్య!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౩౯

వివిధయోనులలోఁ బుట్టి వెతలు గుడుచు
జీవులకు నీకు వియ్యము చెల్లునయ్య?
యిట్టి జీవుల సృష్టింతువేల స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౮౦

ప్రకృతి సర్వము* త్వద్గాత్రభవమటంచు
సన్నుతింతురుగాని సంసారఘోర
భూతమున కేది మూలమో బోధపడదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౮౧

సర్వకార్యసమర్థమా శక్తి గలిగి
యుండియును నీవు మమ్మిట్టు లుద్భవింపఁ
జేసి నీ చింత లేకుండఁ జేయ నేల
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౮౨

స్వామి ! నీ విట్టు లొంటరివాఁడ వగుట
యేమి న్యాయము ? మాతోడ నేల కలసి
యుండ వది నీకుఁ దప్పుగా నుండు నేమి ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౮౩

మాయయే నీ స్వభావమై మాయ నీకు
వేఱు కానిదియై మాకు వింత గొలుపు
చుండు, నీ వెట్టు నిర్వ్యలిప్తుఁడవయ్య ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

* శ్రుతి :- ప్రాణాద్వాయు రజాయత, ఇత్యాది

౩౪౪

నాదుచిత్తము భ్రమరమై నీదు పాద
పద్మములలోన వ్రాలి తపస్సు చేయు
భాగ్యమును బొందు తరుణ మెప్పటికి వచ్చు?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౪౫

క్షీరసాగర మమృత మిచ్చినది యొక్క-
సారి కావచ్చు, నీ కథాసాగరంబు
భక్తులకు నెన్నిసారులు పంచి యిచ్చె?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౪౬

మధురమైనట్టి నీ దివ్యకథలు నార
దాదిమును లెన్నిసారు లాప్యాయనముగఁ
బానమును జేసి సంతృప్తిపడ రదేల?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౪౭

మోహ మను దొడ్డ మొసలికి మ్రొగ్గి, ముక్తి
కోసమని నీకు మొఱపెట్టుకొనుటకూడఁ
దెలియనట్టి గజేంద్రులు కలరు స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౮౮

తృష్ణ యను తీవెలను బెంచు తీర్పరాని
కోరికలలోన మునిఁగి యే కోశమందు
నిన్ను ధ్యానింపనైతి మన్నింపవయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౩౮౯

రాగపాశానుబద్ధమై సాగిపోవు
నా మన స్సను నుయ్యాల స్వామి! నీకు
నూఁపఁగా నిత్తుఁ, బ్రేమతో నొక్కసారి
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౩౯౦

విమల భవదీయ వదనారవింద దివ్య
మధురమకరందమును గ్రోలు మధుపకులము
నందు నన్నేల పుట్టింపవైతివయ్యా?
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౩౯౧

నీదు సౌందర్యలక్ష్మికి నేదియేని
దృష్టిదోషము కలుగమి యిష్టమేని
నా మనస్సను కపికి స్థానమ్ము నిమ్ము
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౩౫౨

నిత్యసంసారతాపము నీరసింపఁ
జేసి భక్తుల రంజింపఁజేయఁగల్గు
కాలమేఘము నీవె కాఁబోలునయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౫౩

అస్మదీయంబులగు చింత లనెడి తంతు
సంతతికిఁ జాటుగాఁ దోఁచు స్వామి! నీ ము
ఖారవిందమ్ము దర్శింపనగునె నాకు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౫౪

నీదు వదనారవిందము న్విడువనట్టి
పుండ్రములు మూఁడు సత్య - మపూర్వమైన
జ్ఞాన మానందమును దెల్పుఁగాదె స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౫౫

నారదుఁడు గానమును జేయునాఁడుగాని
పద్మ, నీ పాదపద్మముల్ పట్టునపుడు
గాని నా మొఱ కొంతైనఁగాని వినవో
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

మా స్వామి

౩౫౬

పుణ్యమును బెంచుఁ బాపమ్ము పోనడంచు
నంచు నెంచియె నీ నామ మందుకొనను;
దానిలో నున్న మాధుర్యధార చూతు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౫౭

సర్వకల్యాణములకు నాచార్యకమ్ము
చేయఁగాఁ గల నీ పాదసేవ నాకు
దొరకె నింకేమి కావలెఁ బరమపురుష!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౫౮

వీనులకుఁ గన్నుఁగవకును విందుఁ గూర్చి
డెంద మానందసందోహ మందఁజేయఁ
గల్గినది నీదునామ మొక్కటియెగాదె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౫౯

నీదుచూపుల మాలలు నిఖిలలోక
దీప్తి కాధారమైన పందిరులు స్వామి!
నీ ముఖజ్యోత్స్న వెలుఁగు లన్నింట మెఱుఁగు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౬౦

నీవు సాక్షాత్కరింపఁగా రావుగాని
నిన్ను మించిన సద్గురు నెన్నలేము
నీకు నీడైన మిత్రుఁడు మాకు లేఁడు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౬౧

స్వామి! నీ ప్రకృతిలోనె * వైషమ్య మేదొ
యుండి సృష్టికి బీజమై యున్నదందు
రందు గర్భితమైన భాష్యమును గలదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౬౨

ఎన్ని క్లేశములైన సహింతుఁగాని
నీ ప్రసంగ మెఱుంగని నెలవులోన
నిలువఁజాలను క్షణమైన నీరజాక్ష!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౬౩

నిఖిలకల్యాణములకు నీ నెలవు నెలవు
సకలజగముల కేవె విశ్రాంతిభూమి
వాప్తకోటికి నీ వభయప్రదాత
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

* సత్త్వరజస్తమోగుణాత్మకమైన ప్రకృతియే, లయమునకు సృష్టికి మూలమని శాస్త్రము

౩౬౪

సాగరము మూలముట్టుగఁ ద్రాగె నొకఁడు
నీ కథాసాగరము సర్వలోకములును
ద్రావినను స్వామి! బొత్తిగాఁ దఱుగదేమి?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౬౫

నిన్ను నిందించి ముక్తి నందించుకొన్న
వ్యక్తులును బూర్వ ముండెడివారఁటంచుఁ
గథలలో విందు మదియు నీ కరుణగాదె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౬౬

విషమయంబగు స్తన్యముఁ బీల్చి యవల
శేషఫూత్కార విషముతోఁ జెలిమి చేసి
యమృతమయుఁడవు కావుట యబ్బురంబు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౬౭

స్వామి! నీ చేతిమాయలోఁ బడిన మేము
భ్రాంతివడి యాత్మదేహవిభాగమందు
లేశమైనను గుర్తింపలేము నిజము
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౬౮

రజ్జువే సర్పమంచు విభ్రాంతి పడుచుఁ
దత్త్వ మెఱుఁగక లోకవృత్తమ్ములోనఁ
గష్టములు తెచ్చిపెట్టుకోఁగలము మేము
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౬౯

గాలి వీచెడునందాఁకఁ గదలిపోవు
నాకులను బోలియుందుము; మా కవిద్య
తొలఁగునందాఁక భ్రాంతియు నిలిచి యుండు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౭౦

శేషశైలంబుపై నివసించు నీకు
నిన్ని మాయలు మర్మము లేల స్వామి !
నీ రహస్యము గుర్తింపనేర రెవరు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౭౧

శేషుఁడే శైలమై నీ విశేష మెఱిఁగి
పూర్వజన్మప్రవృత్తి సంపూర్ణముగను
వ్యక్త మొనరించుచుండు నవ్యక్తుఁడయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౨౨

సంద్రమునఁ బర్వతంబున శయన మొనరఁ
జేసికొని పవ్వళించుటఁజేసి నీకు
ఘనత మిక్కిలి పెరిఁగి యుండెను గదయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౩౨౩

కొండకోనలలో మును లుండునట్లు
స్వామి ! నీవును గొండలపై నివాస
ముండుటకు హేతు వేదైన నుండవచ్చు
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౩౨౪

నిన్నుఁ బేర్కొంచు నీ కథ లెన్నుకొంచు
నీదు చింతన గావించు నేర్పరులకు
నెట్టి యానంద మిత్తువో యెవరి కెఱుక ?
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౩౨౫

కేవలరజస్సు - తమమును గీలుకొలిపి
దారపుత్త్రాదిమోహంబు దగులఁజేయు
చిత్తవృత్తిని దూరము చేయవయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౩౨౬

దయయు దాక్షిణ్యమును గల్గి ధన్యమైన
వృత్తి యేదైనఁగాని నా కిత్తువేని
యెన్ని పుట్టువులైన సహింతునయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౨౭

నిన్ను యాచింపఁగావలె నన్న నెల్ల
వారికిని యోగ్యతలు కానఁబడవు స్వామి !
యట్టి యోగ్యత యబ్బుటే యబ్బురంబు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౨౮

నీ విలాసమ్ములను జూపి నిఖిలలోక
ములను మోహమ్ములో ముంపఁగలవు స్వామి !
మునిఁగి తత్త్వంబు గుర్తింపఁబోము మేము
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౨౯

ప్రకృతిసంబంధమునఁజేసి పరమపురుష !
నీకుసైతము మలినము సోఁకునంచు
సూక్ష్మముగ శాస్త్రములు చెప్పుచుండునయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౩౮౦

మాదు మోహాబ్ధి కవధియే లేదుగాన
మత్స్య రూపంబు గైకొని మాకు నచ్చు
రీతి విహరించి మమ్ముద్ధరింప నీవు
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౩౮౧

అంబునిధిలోన మునిఁగినయట్టి ధాత్రి
నుద్ధరించియు మమ్మేల యుద్ధరింప
రావు భవసాగరం బీఁదరానిదయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౩౮౨

ఉగ్రనరసింహమూర్తివై యొక్క రిపుని
మాత్రమే చంపితివి మాకు శత్రు వొకఁడు
కాదు, కామాదు లెందఱో గలరు స్వామి !
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౩౮౩

నీవు భిక్షాప్రవృత్తి గణింతువేని
మేము నేర్పెద మా విద్య స్వామి ! నీకు
బలిని యాచించినను ఫలింపదు గదయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౩౮౪

పరశురాముఁడవై స్వామి! యిరువదొకటి
సారు లెవ్వరినో ద్రుంచి పోరు పెంచు
కొంటివఁట; నీ స్వభావంబు గుర్తు వచ్చె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౮౫

రామచంద్రుండవై పరంధామ! నీవు
మాకుఁ జూపితి వాదర్శమార్గములను
నిన్నుఁ గీర్తించు కావ్యంబు లెన్నొ వెలసె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౮౬

కృష్ణలీలల కంతు పొంతేది కలదు?
పూర్ణపురుషుండవై పుణ్యభూమియందు
నవతరించితివయ్య యనంతమూర్తి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౮౭

ఎంతటి తృణీకృతబ్రహ్మ యోని నీకు
మ్రొక్క, తీర్పక – పదపడి చిక్కు వడని
వాఁగు లేఁడయ్య యది నీ ప్రభావమయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౮౮

మానవుల చిత్తవృత్తుల నానుపూర్వి
కముగ గుర్తించి వారి యోగ్యత లెఱింగి
వారలను దారికిని దెచ్చువాఁడ వీవె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౮౯

కలలలోఁ దర్శనం బీయఁగలవు పిదప
వలయు సదుపాయములు చూడఁగలవు స్వామి!
నీదు వైచిత్రి మా కెట్లు బోధపడును?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౯౦

కలిమిలేములు రెండింట జ్ఞప్తి వచ్చు
వేలుపవు నీవె యనుటలోఁ జాలినంత
సాక్ష్యమును సేకరింపఁగాఁ జాలినాఁడ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౯౧

ఇంటిలో నెవ్వనికో బిడ్డ కేదో దొడ్డ
బాధ యాకస్మికంబుగ వచ్చిపడిన
నీవు జ్ఞప్తికి వచ్చుట నిజము స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౬_౨

ధర్మసంరక్షణార్థమై ధాత్రి నీవు
యుగయుగంబుల నుద్భవం బొందువాఁడః
వదియె భవదీయకథలలో నద్భుతంబు
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౩౬_౩

సారహీనంబునైన సంసారమందు
సేవకావృత్తి పెరిఁగి నీ సేవ యెఱుఁగ
నట్టి దుర్దశలో మమ్ముఁ బెట్టెనయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౩౬_౪

బుద్బుదప్రాయమైన యీ పుడమిలోని
భోగభాగ్యములే సత్యములుగ నెంచు
నెవనికో యూడిగమ్ము చేయింతువేల ?
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౩౬_౫

పాఁపనోటను మ్రింగుడు వడెడు కప్ప
యీఁగకై నాలుకను జాఁచి యెగురునట్లు
లోక మెప్పుడు పరులఁ జీకాకుపఱచు
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౩౯౬

ఎవనిఁ జూచినఁ దనబాధ లేవో యిన్ని
ముంచుకొని వచ్చునట్టులే యెంచుకొనును;
గాని, యన్నింటికిని బరిష్కర్త వీవె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౯౭

మొదలు సుఖదుఃఖముల కేది మూల మగునో
కొంచెమేనియుఁ దెలియక కొట్టుకొనెడి
మాకు నీ ధ్యాన మొక్కటే మంచి మందు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౯౮

నిన్ను ధ్యానించుటే కాక నీ పవిత్ర
కథలు చిత్రింపఁజాలిన కవితకూడఁ
దరతరంబులు మా యింట దొరకుఁగాక!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౩౯౯

ఇతరమోహము లేవి నా కీయఁబోక
నీదు పాదాంబుజంబుల నిత్యమోహ
మొకటి యిచ్చినఁ జాలు నన్నుద్ధరింప
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౦౦

ఎవనికో యాఁడిగము చేసి యింత తినెడి
మానవునికన్న నీ సేవ మఱిగి 'పస్తు'
లుండువాఁడైన గౌరవార్హుఁడే యగును
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౦౧

లోభమోహభయంబుల ప్రాభవమునఁ
జేయఁగారాని వే వేవొ చేయుచుండి
నీదుమహిమను గుర్తింపనేరమయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౦౨

అలఁతి బ్రదుకున కిన్ని యభ్యంతరములు
మాటి మాటికి సృష్టింపనేటికయ్య ?
వానిఁ గడచినవాఁడె నీవాఁడు తుదకు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౦౩

ఎన్ని చూపులతో నీ పరీక్ష జరుగు
చుండునో నీకె తెలియుచునుండు స్వామి !
ఆ పరీక్షకు గట్టెక్క నలవి యగునె ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౦౪

వేదములు నిష్ఠతో వల్లె వేయువాని
కొదవు పుణ్యఫలంబులే యొప్పిదముగ
నీదుభక్తున కిచ్చి మన్నింతువయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౪౦౫

ఉర్వి, భవదీయనామపీయూషధార
చవి యెఱింగినవారికి సర్వతీర్థ
ఫలిత మది దక్కునల్లె పెద్దలు వచింత్రు
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౪౦౬

నీదునామంబు ధ్యానించు నేర్పు గలుగు
మానిసికి స్వామి! స్వర్గసామ్రాజ్య మేల?
అది యెఱుంగనివాని కెయ్యదియు లేదు
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౪౦౭

సత్త్వగుణ మున్నవాఁడె నీ సన్నిధాన
వర్తి యనుమాటలోని భావంబు దెలిసి
మెలఁగ నేర్చినవాఁడె తత్ఫలము పొందు
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౨౦౭

వేషభాషలతో జాతిభేదభావ
బుద్ధితో నిన్ను గుర్తింపఁబోము ; నీదు
తత్త్వ మెఱుఁగంగవలెనన్న దారి వేఱు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౦౮

భుక్తి ముక్తి ప్రసాదించు శక్తి కలుగు
స్వామి వని నిన్ను గుర్తించువాఁడె భువిని
భక్తుఁడై మోక్షపదవి కుద్యుక్తుఁ డగును
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౦౯

ఎన్ని జన్మంబు లెత్తితి నెవరు తల్లి
దండ్రులో పుత్త్ర పౌత్త్రు లెందఱో యెఱుంగ
లేను, మోహము శుష్కింపలేదు స్వామి !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౧౦

ఇతరచింతల కవకాశ మిచ్చి నీ ప్ర
మేయమును దగ్గఱకుఁ జేరనీయనట్టి
మోహమును ద్రుంపవా జగన్మోహనాంగ !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౧౨

దారపుత్త్రాదిసర్వబంధముల వలన
క్షణము విశ్రాంతి దొరకని జన్మ మేల
యిచ్చినాఁడవు మాకుఁ బరీక్షయేమొ!
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౪౧౩

కాలచక్రము వెంటఁ జీకాకుపడుచుఁ
దిరుగుచును మోహమున నిన్నుఁ దెలియలేము;
జీవు లీ రీతిఁ బుట్టి నశింపవలెనె?
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౪౧౪

ఎన్ని జన్మంబులకు మఱి నిన్ను గుర్తు
పట్టు జ్ఞానము మాకు సంప్రాప్తమగునొ
తెలియకున్నది స్వామి! మా తెలివి యెంత?
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౪౧౫

మేడలను మిద్దెలను మితి మీఱు భోగ
భాగ్యములఁ గూడఁబెట్ట సంబరము గాదు;
నిన్ను మఱచినవాని కే మున్న నేమి?
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౪౧౬

స్వామి! నీ చూపు లేనినాఁ డేమి చేయఁ
బూనినను మాకుఁ గలసిరాఁబోదు భువిని
మాదె కర్తృత్వమని పైకిమాత్ర మంద్రు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౧౭

నీదు కరుణాప్రసార మెంతేని యున్న
వాఁడె లోకానఁ బేరు గలాఁడు స్వామి!
వాని భాగ్యమె భాగ్య మివ్వసుధలోన
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౧౮

నీవు లేనట్టి దేది కాన్పింప దైన
నిన్ను నెవ్వారు కనుగొననేర రేల?
స్వామి! నీ మాయ కారణ మేమొగాని
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౧౯

నిన్న మొన్నటిదాఁక నీ పున్నవార్త
కొంచెమేనియుఁ బట్టించుకొనని వ్యర్థ
జీవితంబును గడపిన జీవినయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౨౦

ప్రాయ మింతకు మిగులఁ గై వ్రాలెఁ; జిత్త
శాంతియును జాఱె మోహవిభ్రాంతు లొదవె
నిట్టి దశలోన నిన్నుఁ గన్పట్టు టెట్టు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౨౧

తోఁచిన విధాన మాటలతోడ నిన్నుఁ
బిలుచుకొని సంబరం బందఁగలను గాని
ధ్యానమున యోగమున నిన్నుఁ గానలేను
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౨౨

ఒక మనోహరదివ్యమూర్తికిని నీకు
నొక 'యభేదము' కల్పించియును మదీయ
హృదయమున దాఁచుకొందు నా కదియ చాలు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౨౩

నాకు నచ్చిన మాటలే నీకుఁ బూల
దండలుగ గ్రుచ్చి యర్పించుదాఁక మనసు
కుదుటపడదయ్యొ; నట్టిదే కోరుకొందు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౮౩౮

కొండకును వచ్చి నీ పూజకొఱకు వేచి
సొమ్ము చెల్లించుకోలేను సుమ్ము స్వామి !
రెండు మూఁడేండ్లకైన దర్శింప వత్తు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౮౩౯

ఇదిగో ! తిరుపతి పైనమం చెవరు మాట
చెప్పినను నాదు డెందానఁ జెప్పరాని
మోద మొదవును గారణ మేదోగాని
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౮౪౦

నిన్ను నావాహనము చేసి నీదుమూర్తి
కన్నులను బెట్టుకొని యెల్లకాల మిట్లు
కొలిచి యానందమును బంచుకొందునయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౮౪౧

నిన్నుఁ బేర్కొన్నఁ జాలు నా కున్న బలము
పెరిఁగి కలమును జెరచెరఁ బరుగులెత్తు;
నిది మహాభాగ్య మనియె నే నెంతునయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౭౨౮

ఏది వ్రాసినఁ జదివిన నీదుమూర్తి
నాదు హృదయానఁ దవిలి సమ్మోద మొదవు;
స్వామి! యింకేమి నాకుఁ గావలసియుండు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౭౨౯

చేసితిని పెక్కు రచనలు చేసి బాస
కూడిగము, గాని సంతృప్తి యొదవలేదు
నిన్ను నీ శక్తి వర్ణించుకొన్నదాఁక
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౭౩౦

కలములో శక్తి యున్నంతకాల మింక
నిన్నుఁగూర్చియె స్వామి! వర్ణించుకొందు
నెంత యితివృత్తమైన నీ వీయఁగలవు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౭౩౧

కథలుగా గాథలుగ రూపకములు గాఁగఁ
గావ్యములు వందలుగ వ్రాయఁగలను స్వామి!
నీదు కరుణామృతమ్ము నన్నాదుకొన్న
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౩౨

చేతిలో నున్న కవితా విభూతిచేత
నిన్నుఁ బూజించుకొనుటయే నేర్చుకొందు,
నింక నేదియు లేదని యెంచఁబోను
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౩౩

నాకు నీ విచ్చు శక్తి యున్నాళ్ళదాఁక
దాఁచిపెట్టి యొకానొక తప్పు చేసి
యుంటినని నేఁడు నిజము గన్గొంటినయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౩౪

అక్షరాక్షరముగ నీ యనంతకీర్తి
రోళ్ళ రోఁకళ్ళగా వేయినోళ్ళ సతము
చాటి పాడించుకొందుఁ బ్రచారసరణి
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౩౫

నాకు లోకము తెలిసిననాఁటనుండి
నీ యుదంతమె చెవికి విన్పించెనేని
కొంత సాధన చేసి భావింతునేమొ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౩౬

నిశ్చితజ్ఞానమే లేక నీ యనంత
మహిమ గుర్తింపనైతి నే మాత్రమైన
నేఁడు విశ్రాంతి లేదాయె నీరజాక్ష!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౩౭

నీదు మోహములోఁ జిక్కి నీదుసేవ
కోసమే మీఁదుకట్టి సంతోసపడుట
కైన జంజాట మది యడ్డమాయెనయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౩౮

ఈ ప్రపంచములో నుండి నీ ప్రమేయ
బుద్ధితో సంచరించెడి పుణ్యపురుషు
లుందు ; రస్మాదృశుల మట్టు లుండలేము
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౩౯

కవితలో నిన్నుఁ గీర్తింపఁగలిగి నిన్ను
హృదయమున దాఁచుకొను శక్తి యొదవె నింక
నిట్టి బంధమె పెంచి నన్నేలు కొనవా!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౪౦

కమ్మని కవిత్వమున నీదుకథలు గ్రుచ్చి
పోతనాదులు భక్తిని బోఁత పోసి
యిచ్చి; రవి భక్తులకు మోక్ష మిచ్చుఁగాదె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౪౧

నిన్నుఁ దలఁచిన నీ కథ లెన్నుకొన్న
మనసు మెత్తన యయి మంచితనము కుదురు;
నదియె భక్తుల లక్షణ మగును స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౪౨

ఎట్టి యోగ్యత కలవాని కట్టి ఫలమె
నీవు సృష్టించి యిచ్చుట నిశ్చయంబు
పాత్రలనుబట్టి నీటిని బడయవలయు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౪౩

శ్రుతులలో నిన్ను వర్ణించు సొబగు లెన్ని
వన్నెచిన్నెలుగా వినఁబడుచునున్న
నంతు దొరకవు స్వామి! రవ్వంతయైన
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౪౪

శాస్త్రములు చూచుకొలఁది విచారసరణి
పెరిఁగి నీ రూపురేఖ లెవ్వరికిఁగాని
కంటి కందక మనసును గలఁత వెట్టు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౪౫

చదువు పెరిఁగినకొలఁది జంజాటములును
బలిసి, చిత్తము శాంతిని బడయఁబోదు;
శాంతమే లేక సౌఖ్య మెచ్చటను లేదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౪౬

శాస్త్రమను దుర్గమాటవి సంచరించి
వెలుఁగు కనలేక దిక్కులు వెదకి వెదకి
విసివి వేసారి తుదకు నిర్విణ్ణుఁ డగును
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౪౭

నీ వెలుఁగు సోఁకువాఁ డెంత నిబ్బరంబు
నైనఁ బూనియు శాస్త్రరహస్యములను
జిటికలోఁ దీర్చి దిద్ది వచింపఁగలఁడు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౪౮

మందుఁ డెన్నేండ్లు శాస్త్రములందు మునిఁగి
కొట్టుకొన్నను నీ జాడ కొంచెమేని
కానరా దాతనికి, వాని కర్మ మదియె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౪౯

శిశువుచేతికిఁ గత్తి యిచ్చినవిధాన
నిన్ను నెఱుఁగనివారల కున్న శాస్త్ర
మక్కఱకు రాదు; పైగ ననర్థకంబె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౫౦

నీవు నివసించు కొండలోఁ ద్రోవలోని
ఱాలకును బుణ్యమునఁ గొంత పాలు గలదు
భక్తజనపాదపద్మసంస్పర్శ మగుట,
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౫౧

ఇతరయుగములలో లేని వెన్నొ కథలు
గాథలును నీ చరిత్రలోఁ గలవు గాన
నీ యుగమె మాకు మేలని యెంతుమయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౭౫౨

కలియుగము వట్టి పాపిష్ఠకాల మంచు
మందబుద్ధులు పలికెడి మాటలకును
విలువ నీయరు నీ యున్కి తెలియువారు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౭౫౩

శేషుఁడా నాఁడు తప మేమి చేసి నిన్ను
మోసె; నేఁడును శైలమై మోయుచుండు
భాగ్యమది దక్కె నెంత ప్రాభవము దొరకె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౭౫౪

శ్రీనివాసుఁడవయ్య లక్ష్మిని ద్యజించి
కొండకొమ్మున నొంటిగా నుండనేల ?
దానిలో నంతరార్థ మేదైనఁ గలదో !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౭౫౫

కోవెలకు వచ్చు యువతుల కొప్పులోనఁ
బూలు తగవని శాసింతువేల స్వామి ?
అమ్మవారట లేరని యర్థమేమొ !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౫౬

ఆమె లేకున్న నీ కేల స్వామి ! సర్వ
భూషణము లింద్రజాలపుఁ బోకడలును
నీకు సంసారబాధలు సోఁకెనేమొ !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౫౭

కొండపై నీవు కులుకుచు నుండనేల ?
కొండ కీవల నా మెయు నుండనేల ?
భక్తులు తరింప నిది యొక బాటయేమొ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౫౮

నిన్నుఁ జూడను వినను మా కున్న కనులు
చెవులు చాలవు మాటలు చెప్పనేల ?
నీవు చూడని యంశ మెందేని లేదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౫౯

సర్వమున కంతరాత్మవు స్వామి ! నీకుఁ
దెలియనిది లేదు మా జన్మములకు నెట్టి
గతులు గల్పింతువో యెఱుంగము గదయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౬౦

కలియుగములోని పుణ్యమువలన నీవు
శేషశైలముపై నధిష్ఠించియున్న
వాఁడ వని పెక్కు కథలు విన్నాఁడనయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౬౧

ఇంతటి యదృష్ట మున్న మా కేమి లోటు –
పాటు లొదవును స్వామి! మా పాపపుణ్య
ములకు నీయందె 'బాధ్యత' కలదు కొంత
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౬౨

పాపపుంజము లను పాఁపపడగ నీడ
బ్రదుకు గడపెడి మాకు నీ భవ్యనామ
గీతి గారుడమంత్రమై కెరలుఁగాక!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౬౩

ఘోరసంసారమకరము కోరలందుఁ
బొరలుచున్నట్టి మమ్ము నీ కరుణఁజేసి
యల గజేంద్రుని జూచిన ట్లాదుకోవె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౬౪

ఈ క్షణమొ రేపొ ప్రాణము లేఁగునంచు
నిత్యమును మృత్యుభయమున నిండియుండు
మమ్ముఁ గాపాడకున్న లాభమ్ము లేదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౬౫

నాది నే నను వట్టి నినాదమునను
ఘోరసంసారకూపానఁ గూలిపోవు
మమ్ము రక్షింప నీకన్న మాకు లేరు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౬౬

తుది మొదలు లేని కాలముతోడఁ దిరుగు
మేము బ్రదికెడి దెన్నాళ్లు స్వామి ! నిన్ను
నెట్లు గుర్తింపవలయునో యెఱుఁగమయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౬౭

కోర్కుల తరంగములు చుట్టుకొనుచు నుండు
నా మనస్సను సరసిలో స్వామి ! నీవు
హంసవై నిత్యమును గ్రీడలాడవయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౬౮

హింస యెఱుఁగని నడవడి నిచ్చి నాదు
వాక్కులో సత్యమును గూఢిపఱుపవయ్యా
సత్వగుణమున కవిమె బీజములు స్వామి!
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౪౬౯

వేంకటాచలమం దుద్భవించు మేఘ
మూర్తి! నీ కరుణారసమున మదీయ
తాపము శమింపఁజేయక తప్పదయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౪౭౦

కొండకొమ్మున మేఘమై కుదురుకొనియుఁ
గరుణ యను వర్ష ధారలు కురియఁజేయు
నీ మహాత్త్వంబు నెన్నఁగా నేరనయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౪౭౧

నీవు హంసవా * లేక యే నీరదమవా
నాకుఁ దెలియదు; వైదికలోక మెఱుఁగు
నీదుమహిమము నెట్లు వర్ణింతునయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

* నీవు హంస వని శ్రుతి

౪౭౨

ఇంట బయటను మెండుగా నంటియున్న
నాదు నజ్ఞానతిమిరమునకుఁ ద్వదీయ
పాదసేవయె రత్నదీపముగ నెంతు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౭౩

స్వామి ! మా సౌఖ్యమున కని పంచభూత
ములను సృష్టించితివి వానివలనఁ గలుగు
ఫలిత మిట్టిదియని మేము తెలియలేము
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౭౪

జ్ఞాన మానందమును స్ఫటికమును బోలు
నాకృతియు నీకుఁ గలవని యందురయ్య !
అట్టి నీ దివ్యమూర్తి మా కెట్లు తెలియు ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౭౫

నిఖిల జగములు సృష్టింప నేర్చు బ్రహ్మ
సర్వజగములు హరియింపఁజాలు హరుఁడు
నీదు చేసైఁగ గుర్తించి నిలుతురయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౭౬

స్వామి! మా తండ్రి వనుచు విశ్వాస మున్న
మాకు నీ యంశమును గొంత సోఁకి నీదు
నాస్తిపాస్తులలో భాగ మబ్బవలయు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౭౭

గర్భవాసమ్ములోని దుఃఖమ్ముగాని
పుట్టిగిట్టుటలోని యిక్కట్టుగాని
వలదు వల దింక నీలోనఁ గలుపుకొమ్ము
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౭౮

భౌతికంబుగ నినుఁ గోరి పడయవలయు
భాగ్యమే లేదు నాకు నీ పాదపద్మ
యుగళసంసేవనం బది యున్నఁ జాలు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౭౯

నీదునామము ధ్యానించి నీదుమూర్తి
మదిని భావించి నీమీఁది మమత పెంచి
బ్రదుకుటే నాకు హితమైన బాట స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౮౦

నడుమ నెన్నెన్ని యిడుమలు కుడువవలసి
వచ్చినను నిన్నుమాత్రము వదలి బెదరి
చెదరకుండంగ నన్ను రక్షింపవయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౮౧

అనుభవించినకొలఁది నత్యంతమధుర
మై మనస్సును లోఁగొనునట్టి దివ్య
వస్తువవు నీవుమాత్రమే వసుధలోన
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౮౨

క్షణికమైనట్టి సంసారసౌఖ్యమందె
తవిలి యున్నంతదాఁక నీ'తత్త్వ'మసలు
బుద్ధికే రాదు; వచ్చియుఁ బోవు నపుడె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౮౩

ఏది స్థిరమైన యానంద మేది ప్రాప్య
మన్నదే మాకుఁ దెలియుట కెన్నొ జన్మ
ములును బట్టును మా కిఁక మోక్ష మెట్లు?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౧౪

గమ్యమును గుర్తెఱింగి విజ్ఞానగరిమ
కూడఁ బెట్టుచు సజ్జనకోటితోడి
పొందు గలవాఁడె నీ ప్రేమ మందుకొనును
వేగ రావయ్య తిరుమల వేంకటేశ।

౪౧౫

మానవులలోని మంచి యే మాత్రమైన
స్వీకరింపనివాఁ డెన్ని చేసియున్న
నీవు మెచ్చవు వాని మన్నింప వసలు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ।

౪౧౬

పుణ్యపాపంబులయు పుట్టుపూర్వములను
మూలముట్టుగ గుర్తింపఁజాలువాఁడు
నీకు సన్నిధిలో నుండ నేర్చునయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ।

౪౧౭

లాఁతివారికి నిచ్చు చేయూఁతవంటి
యుపకృతియె పుణ్యభాగమై యొప్పుచుండు;
నపకృతి యొనర్చుటే పాప మగును మాకు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౮౮

స్వామి ! నీ సన్నిధిని మ్రొక్కుబడుల సొమ్ము
లెక్కడొక్కలలో నీవు చిక్కుకొంచు
బక్కవారల మమ్ముఁ గాపాడవేమొ !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౮౯

లోకమర్యాదలను జూచు నీకుసైత
మిలను లోకుల సొమ్ము కావలసివచ్చె
నెంతవాఁడవటంచు నిన్నెంచుకొనను ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౯౦

ధనము దంధనమంచు సజ్జనులు దాని
జోలికిని బోరు స్వామి ! నీ వేల దాని
కింత ప్రాముఖ్య మిత్తు వనంతమూర్తి !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౪౯౧

ఆలుమగ లొక్క యూర రెండాలయములు
కట్టుకొని నాల్గుచేతుల పట్టు పట్టి
యెంత మొత్తము సొమ్ము చేర్పింతురయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౮౯—౨

కొండ దిగివచ్చి యమ్మవా రుంట గుడికి
విధిగ యాత్రికు లెల్లరు వెళ్ళవలయు
నంచుఁ గట్టడ చేసితివయ్య స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౮౯—౩

'వేంకటేశ్వర' యను నీ పవిత్రనామ
మవని—పంచాక్షరీమంత్ర మై మదీయ
హృదయమున—తిష్ఠ వైచి పెంపొందవుఁగాక!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౮౯—౪

స్వామి! నీ దివ్యమూర్తి నీ జన్మమందు
నొక్కసారియు దర్శింప నొల్లనట్టి
జనుని జన్మంబు వ్యర్థమై చనునుగాదె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౮౯—౫

అంతలో నుద్భవించెడు సంతరించు
దుష్టసంకల్పములు మమ్ముఁ గష్టపెట్ట
కుండ మా యండదండ నీవుండవయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౯౬

ఆధియును వ్యాధియును నాదు ప్రాణములకు
బాధ గల్గింపకుండ నీ పాదకమల
సేవయే నిత్యమును రక్ష సేయుఁగాక!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౯౭

నీదు సంబంధ మది యెంత నిలుపుకొన్నఁ
గామమోహాదు లడఁగంటువేమి స్వామి?
అవియె 'యాదవముసలాగ్ర'మగును మాకు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౯౮

మింటి మంటిని బదములు రెంటిచేతఁ
గొలిచి యుంటివి, నిన్ను నేఁ గొలుచుచుండు
'నో'మ్మనెడి యొక్కటే యక్షరమ్ముచేత
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౪౯౯

తండ్రి! నీ నామగంగామృతమ్ముచేత
సకలకలుషము లడఁగంటి స్వచ్ఛమైన
యొక ప్రవృత్తికి నవకాశ మొసఁగి యిమ్ము
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౦౦

దారపుత్త్రాదిమోహాతత్పరత నీదు
పాదముల సన్నిధికిఁ ద్రిప్పఁబడిననాఁడె
దీక్ష నెఱవేరినట్లుగాఁ దేల్చుకొందు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౦౧

మోహపాశము నాలోన ముప్పిరిగొని
యుండుకొలఁదిని యమపాశ మొందు బెడద
తెచ్చునని నాకుఁ దెలిసియుఁ దెలియదేల!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౦౨

అందు మొదటిది ఛేదించుకొందు నేని
రెండవది నా మెడకుఁ బూలదండ యగును;
గాని యే నాఁటి కీ దశఁ గాంచఁగలనొ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౦౩

మంచి తల్పంబునను బవ్వళించి యున్న
బంధుమిత్త్రాదు లండగా బలసియున్న
మరణవేదన తప్పింపఁ దరమె మాకు?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౦౪

మరణవేదన తగ్గించు మందు తెలియఁ
జేయు వెజ్జవు నీవు నా చిత్తమందుఁ
గుదురుగా నుండి సమయముకొఱకుఁ జూడు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౦౫

తుదికిఁ జితి పేర్చి కట్టెలే తోడునీడ
యగ్నియే ముఖ్యబంధువై యట్టె మమ్ము
సాగఁద్రోలును ; బిదప నీ సాయ మేమొ !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౦౬

కొండ లేడింటిపై నీవు కులుకుచుండ
నేడు వ్యసనము లను కొండ లెక్కి మేము
కులుకుచున్నార ; మెవ రెంత గొప్పవారొ !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౦౭

కరుణధారలు వర్షించు కాఱుమేఘ
మొకటి, యిందిర మెఱుపుగా నుండ వేంక
టాచలముమీఁద సర్వదా తోఁచుఁగాక !
వేగ గావయ్య తిరుమల వేంకటేశ !

౫౦౮

శేషగిరిమీఁద దొరకు మహౌషధిని మ
దీయసంసారరోగశాంతికిని వాఁడు
కొందు నది నాకు మంగళకంద మగును
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౦౯

స్వామి! శేషాద్రిపై కల్పశాఖివైన
నిన్ను దర్శించినపు డెల్ల నేను గొంత
చిత్తశాంతిని బొంది హర్షింతునయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౧౦

శేషభూధరమందు వసించి సర్వ
లోకమోక్షప్రదానములోన దివ్య
పథములను జూపి మమ్ముఁ గాపాడవయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౧౧

పరముకన్నను బరమై స్వభావరమ్య
మైన నీ దివ్యశక్తి కనంతనామ
ములను సృష్టించుకొందుము మురిపపడుచు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౧౨

మేఘకాంతిని మఱపించు మేనితోడ
పూర్ణిమాచంద్రుని జయించు మోముతోడ
నీవు నిత్యము నాకుఁ గన్పింపవయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౧౩

సర్వకల్యాణసీమమై సర్వజీవి
మోక్షదాయకమైన నీ మూర్తి నేను
గన్నులకుఁ గట్టుకొని చూడఁగలను స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౧౪

ఉపనిషత్తులలో మన ముభయులమును
గలసి యొక చెట్టుకొమ్మలో నిలిచినట్టు
వర్ణనము విందు దాని భావం బెఱుంగ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౧౫

అమితవిషమైన ఫలము నా కారగింప
నిచ్చి యమృతఫలంబును బుచ్చుకొంటి
వేమి న్యాయమ్ము స్వామి! నీ కిదియుఁ దగునె?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౧౬

ఆగమశ్రేణి యనెడి మహావనంబు
నందుఁ దిరుగాడి మిక్కిలి కందిపోయె
నంద్రు నీ పాదములు; వాని నాశ్రయింతు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౧౭

ఎందఱో భవసాగరమందు నీఁద
లేక మ్రందిరి స్వామి! యీ లోకమందు
నే ననఁగ నెంత నన్ గరుణింపకున్న?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౧౮

ఎంత సాధన చేసి నీయంతవాని
కరుణకును బాత్రమైరి లోకమున భక్తు
లట్టి మార్గము నాకుఁ గన్పట్టు టెట్టు?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౧౯

ఎవని నెట్లు పరీక్షింప నేది మార్గ
మదియె యాధారముగఁ జేసి యస్మదీయ
తారతమ్యములను జూతు వౌర! నీవు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

సీ_౨౦

ఆర్తరక్షణ మను సత్రయాగమందు
దీక్షితుఁడవైన నీవు మా పక్షమందె
యుండి రక్షింపకున్న మా కండ యెవరు ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

సీ_౨౧

స్వామి ! యా పాదమస్తక వ్యాప్తమైన
ముదిమిచే మది దప్పి నీ పదయుగములు
మఱచిపోయెదనేమొ నన్నరయువలయు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

సీ_౨౨

కాల మను నీ ప్రవాహవేగంబునందు
నాదుబ్రదుకొక్క బిందువై యేది చేయఁ
గలదు ? గర్వముమాత్రమే నిలిచిపోవు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

సీ_౨౩

ప్రాక్తనంబైన కర్మము ఫలిత మెవని
కేని తప్పదటంచు మ మ్మేల బెదరఁ
జేసెదవు స్వామి ! నీ యండఁ జేరి యుండ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

గీ. ౧౪

శిక్షయును రక్షయును రెండుఁ జేయ నేర్చు
దక్షుఁడవు నీవు స్వామి! నీ దయకుఁ గొంత
పాత్రులుగఁ జేసి మమ్ముఁ గాపాడవయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

గీ. ౧౫

స్వామి! జ్యోతిర్మయుండవు శాస్త్ర వీవు
సర్వమంగళరూపవిజ్ఞానఖనివి
కేవలానందమయుఁడవు దేవదేవ!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

గీ. ౧౬

మానుషంబులునై దివ్యమహిమ చూపు
నీదు నవతారములలోని గాథ లెల్ల
భాష్యములు వ్రాయఁదగ్గవి పరమపురుష!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

గీ. ౧౭

దైన్యమది లేని బ్రదుకు నీ దయకుఁ బాత్ర
మైన వృత్తియు నా కీయవయ్య స్వామి!
ముక్తియో మోక్షమో కోరఁబోనుగాని
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౨౮

ప్రళయకాలాగ్నిగర్భసంభవమొ మృత్యు
వదనగహ్వారజనితమో పరమభీక
రంబు సంసారఘోరచక్రంబు స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౨౯

దారపుత్త్రాదిసర్వబంధములు నాకు
బంధములు గాక మోక్షసంబంధములుగఁ
జేయవే స్వామి! నీ దయచేత నిపుడె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౩౦

నీకుఁ బ్రియమైన వస్తువు నాకు దొరకి
యున్నచో భక్తితో నీకు నొసఁగఁగలను
గాని, తెలియదు నాకు నీలోని గుట్టు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౧౩౧

రమ్యవనమందో లేక యే 'రభస' లేని
చోట నేకాంతముగఁ గూరుచుండి నిన్ను
ధ్యానమును జేసికొను భాగ్యమైన నిమ్ము
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౩౨

ఇతర దేవత లెవరో నా కేమి తెలియ
దరయ నిన్నొక్కనినె దైవ మంచు నెంచి
బ్రదుకుచున్నాఁడ నన్నుఁ గాపాడవయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౫౩౩

నీదునామము ధ్యానింప నేర్తునేని
సర్వతీర్థఫలంబు నా సరస చేరు
సర్వపుణ్యంబులును నాకు సంక్రమించు
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౫౩౪

నీదు నామామృతము గ్రోలనేర్తునేని
స్వర్గ మొక గ్రుడ్డి గవ్వకుఁ జాల ; దింక
ముక్తి యను మాట యెత్తఁగాఁబోను స్వామి
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౫౩౫

చర్మచక్షువులకు నదృశ్యముగ నుండి
జీవధర్మంబు లేనట్టి నీవు మాకు
నెట్టు లభిగమ్యుఁ డౌదువో యెఱుఁగలేము
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౫౩౬

నిన్ను నీ నామములతోడ సన్నుతించు
నిత్యకృత్యంబునకు నొక్క నిమిషమేని
యంతరాయము చేయకు మంతె చాలు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౩౭

అవని నీ చింతనకు దూరమైనవారి
పొత్తు గలిగియు బ్రదికెడి వృత్తి మాకు
నగ్నిపంజరమం దుండునట్లు గాదె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౩౮

చేతనైనంత నీ పూజ చేసిగాని
నిత్యమును నిన్ను వర్ణింప నేర్చిగాని
మదిని సంతృప్తి నందుచు బ్రదుకనిమ్ము
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౩౯

స్వామి-దాసుల కున్న సంబంధ మెప్పుడు
నీకు నాకును గలదయ్య నీరజాక్ష !
నిన్నుఁ గాదని మెవ్వాని నిర్ణయింతు ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౪౦

భక్తియోగమె ముక్తికి భద్రమైన
రాచబాటగ గుర్తించి నీ చరిత్ర
పాటలుగఁ దిద్ది యిచ్చిరి భక్తవరులు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౪౧

అంతరింద్రియనిగ్రహ మనెడి గుణము
లేనివాఁ డాత్మలో నిన్నుఁ గానలేఁడు;
నిగ్రహము లేక యేదియు నిలువఁబోదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౪౨

భక్తి కనుపానమైన యుపాసనంబు
పరమసాధనమై యుండు భక్తులకును;
దాని నావృత్తి చేయఁగా దారి చూప
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౪౩

నాకు నీ విచ్చు కరచరణములచేత
నేను నీ కేమి చేయఁగా నేర్తునయ్య!
గుడికిఁ బోయెదఁ బూలతోఁ గొలుతు నిన్ను
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౪౪

సచ్చిదానందమూర్తి ! నీ స్వచ్ఛమైన
రూప మే రూపమున మాకుఁ జూపఁగలవు ?
దాని కే వేవి ముఖ్యసాధనములయ్యా ?
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౫౪౫

కంటిముందర మా కీళ్లు కానవచ్చు
నీ ప్రపంచము మిథ్యగా నెంచలేను
భ్రాంతిలోఁ జిక్కి యుండుటవలన నేమొ !
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౫౪౬

రజ్జువో సర్పమో గుర్తు రాక భ్రాంతి
పడియు సంభ్రమమునఁ బెద్ద బాధలోన
మునిఁగి తలక్రిందులై చెడిపోదుమయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౫౪౭

నీవు నిత్యము లోక మనిత్య మన్న
తత్త్వ మెన్నఁడు గుర్తింప దారి మాకుఁ
జూపెదవొ యంతవఱకు మా చూపు లివియె
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౫౪౮

సర్వదుఃఖములను బెంపఁజాలు నీ ప్ర
పంచమును మేమె కల్పించుకొంచు భ్రాంతి
లో మునింగియు నిన్నుఁ గన్గోము స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౪౯

భ్రాంతిని నివృత్తి కావించు భాగ్య మెవని
కందునో వాఁడె మోక్షము పొందఁగలఁడు
వాఁడె ప్రాప్యము గుర్తించువాఁడు భువిని
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౫౦

ఆత్మపరమాత్మలకుఁ గల యైక్య మేగొ?
తెలిసి వర్తించుటే మానవులకు జ్ఞాన
మార్గమని చెప్పెదరుగాని మఱతుమయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౫౧

'తత్త్వమస్యా' ది వాక్యతాత్పర్య మెఱిఁగి
నిన్నుఁ గన్గొన జన్మము లెన్నియైనఁ
జాలునో చాలవో గుర్తు చాలదయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౫౨

జ్ఞానము పరోక్ష మనియు నింకను మఱొక్క
రీతి నపరోక్ష మనియు వర్ణింతు రైన
నీ రహస్య మెఱుంగఁగా నేర్చు టెట్లొ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౫౩

మలినమైన మనస్సులో మానవునకుఁ
గొంచెమైనను జ్ఞానము కుదురఁబోదు
జ్ఞానమే లేనినాఁడు నిన్ గాంచలేము
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౫౪

సత్త్వగుణ మున్ననాఁడె సుజ్ఞాన మొదవు
జ్ఞాన ముదయింపఁ బరిశుద్ధమైన హృదయ
మేర్పడును స్వామి ! యప్పుడు నీ యెఱుక దొరకు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౫౫

సకలకర్మంబులకుఁ జిత్తశాంతి - శుద్ధి
ముఖ్యమని సర్వమతములు బోధ సేయు;
నీ రహస్యము తెలిసినవారె ఘనులు
వేగ రావయ్య తిరుమలవేంకటేశ !

౫౫౬

చిత్తశుద్ధి గడించి చేసిన విశేష
కర్మములు మోక్షము నొసంగఁగలవు స్వామి!
భక్తుల ప్రవృత్తి, దానికై పర్వు లిడును
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౫౭

ఐహికాముష్మికసుఖంబు లనుభవింపఁ
గోరు భక్తులు నీ కరుణారసంబు
నుగ్గుపాలుగఁ ద్రావుచు నుందురయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౫౮

కాంక్షలను గాల్చివైచి నీ కరుణకోస
మనుదినంబును శ్రమపడు మనుజు లఖిల
లోకపూజ్యులు; వారికే లోటు లేదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౫౯

కాలగతి యంతయును నీదులీలలకు న
ధీనమై మాకు రవ్వంత తెలియనట్టి
బాటలో సాగుచుండును బరమపురుష!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౬౦

ధర్మము నధర్మము నెఱుంగఁ దలఁచినపుడు
కర్మములఁబట్టి భిన్నమార్గములు దోఁచు;
వానిజోలికిఁ బోక నిన్నే నుతింతు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౬౧

మా యొనర్చెడి పాపకర్మముల ఫలము
ననుభవించెడి దశ యర్థమైనయపుడె
నీవు జ్ఞప్తికి వత్తువు నీరజాక్ష!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౬౨

అల్పులమె యయ్య నజ్ఞాన మధికమగుట
మా స్వరూపమె మఱచి యే మాత్రమైన
నీ స్వరూపము గుర్తింప నేరమయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౬౩

ఈ ప్రపంచములో నుదయించు సర్వ
దుఃఖములు నీవు పంపిన దూత లగుచు
మాకు బోధింపఁగలవు సన్మార్గములను
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౬౪

జీవితములో విలాసము లేవో తుదకుఁ
దుడిచివైచియు నీ ధ్యాసతో మెలంగ
నేర్చునప్పుడె నీవు కన్పింతువయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౫౬౫

విత్తనముఁబట్టి పంట కన్పించునట్టు
చేసియున్నట్టి కర్మమే చివరి కెవరి
కైనఁ దగినట్టి ఫల మిచ్చునయ్యా స్వామి!
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౫౬౬

సాగరతరంగముల నాఁపఁజాలువాఁడు
కర్మసూత్రము దాఁటి పోఁగలుగువాఁడు
లేఁడు లేఁడయ్యా స్వామి! యే నాఁడుగాని
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౫౬౭

కాలమునుబట్టి మాఱిపోఁజాల, దవల
మరణమే వచ్చినను రూపు మాయఁబోదు
కర్మ మట్టిది: తేలిక గాదు మాకు
వేగ రానయ్యా తిరుమల వేంకటేశ!

౫౬౮

మాకు సంకల్పములఁబట్టి మంచిచెడ్డ
లేర్పఱిచి చూపెదవు గాన నేమి చేయఁ
గలవాం చేయుము నీ పాదములనె దలఁతు
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౫౬౯

జననమరణాత్మకంబైన యసారమైన
మాయ సంసారమునకుఁ గర్మంబె మూల
కారణం బని పలికిరి కాదె బుధులు
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౫౭౦

కర్మబంధవిముక్తికై కానరాని
కష్టములు సైచి నీ పాదకమలములనె
నమ్మి బ్రదికెద నాకేమి నష్టమయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౫౭౧

మాకు నీ సాయ మేమియు లేకయున్న
గడ్డిపఱకైనఁ ద్రుంపఁగాఁగలమె స్వామి!
అన్నిటికిఁ గర్తవవు నీవె యంబుజాక్ష!
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౫౭౨

ప్రకృతిమోహము లే నాఁటివఱకు మాకు
నిలిచియుండునొ యందాఁక నిశ్చయముగఁ
జూడ సంసారమునకు దాసులము మేము
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౭౩

ప్రకృతిపురుషుల కున్న సంబంధ మేదొ
పురుషుఁ డన నెవ్వఁడో పుట్టుపూర్వములయు
గుట్టుమట్టు లవేల నీ గోష్ఠి యుండ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౭౪

సాక్షియై లోకపరిణామ మక్షియుగము
తోడఁ గాంచుచుఁ బురుషుఁ డెవ్వఁడో యుం
నందు రాతఁడు నీవెగా కన్యుఁ డెవఁడు?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౭౫

వ్యక్త మవ్యక్త మనుచు నవ్యక్తమైన
వట్టి 'పరిభాషలోఁ' బడి కొట్టుకొనను
గారణం బేమి స్వామి! నీ కరుణ గలుగ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౭౬

బ్రహ్మమొ ప్రకృతియో పరబ్రహ్మ మేమొ
నాకుఁ దెలియదు స్వామి! యీ లోకమునకు
నీవె సర్వాధికారివి నిశ్చయముగ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౭౭

నీదు ద్వైవిధ్యమో లేక నీ యనంత
శక్తిపరిణామమో చెప్పఁజాలనట్టి
గొడవలోఁ బడి నిన్నెట్టు విడువఁగలను?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౭౮

శాస్త్రమని తత్త్వమని పెద్ద చదువు చదివి
వాదములలోన మునిఁగినవాఁడఁ గాను,
స్థూలముగ నిన్నెఱింగి నా త్రోవఁ బోదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౫౭౯

శాస్త్రచర్చలలో దిగి స్వామి! నీదు
మూలరూపము గుర్తింపఁబోక బాధ
పడుటకన్నను మౌనభావంబె మేలు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

గీ ౦

ద్వైత మద్వైత మంచు వేదాంతగోష్ఠి
జరిపి యేమియుఁ దెమలని జన్మమునకు
నీ స్మరణ మొక్కటే మందు నీరజాక్ష !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

గీ ౧

యోగమో భవరోగవియోగమో స
రూపసాయుజ్యకైవల్యరూప మేమొ
నాకుఁ దెలియదు; నా స్థితి నీకుఁ దెలియు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

గీ ౨

ఆత్మసౌందర్యసౌభాగ్య మనుభవింప
లేనివాఁ డొక్క బాహ్యములోనె చూపు
నిలుపునఁట; దాని మూలము నీవె స్వామి !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

గీ ౩

భ్రాంతికిని మాయకును మమ్ము బానిసలుగఁ
జేసి బాధింపఁబోకు నీకోస మేమి
చేయవలయునో తప్పక చేయఁగలము
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౮ ౪

ఆత్మ నెఱుఁగని వ్యక్తి కే యంశమందు
మనసు నిలువక ఱాతిపైఁ జినుకు పడిన
రీతిఁ జెదరును గాన నే రీతి నేర్తు ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౮ ౫

వట్టి యావేశములు గాని వ్యర్థమైన
చదుప్రసంఖ్యలు గాని నీ జాడ చెప్ప
చూపలేవాయె నిన్నెట్లు చూడఁగలము ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౮ ౬

బాహ్యాశాసనములు పెట్టు బాధలకును
విఱుగు డొక్కఁడు కలదు మా మెఱుకలోన
నిన్ను ధ్యానించి పూజింప నేర్చుకొనుటె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౫౮ ౭

ఇతరకర్మకలాపము లెంతవఱకు
నుపకరించునో నా కేమి యూహ లేదు;
నీదుధ్యానమె పూజయే నిలిచె నాకు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

గీ. ౮

తత్త్వమో ధర్మమో సంప్రదాయమేమొ
నాకుఁ బట్టదు స్వామి! యీ లోకమందు
నీవు నీ జాడ నీ ధ్యాననిష్ఠ చాలు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

గీ. ౯

తత్త్వలక్ష్యంబుతోఁ బురాతనవిధాన
మేదియును దెచ్చి క్రొత్తగా నీయలేను;
నిన్నుఁ బూజింతు మదిలోన నిలుపుకొందు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

గీ. ౧౦

పూర్వగాథాప్రపంచంబు – పూర్వమతము
జోలి నా కేల? యీ యున్నకాల మెల్ల
నీకు వ్యయపెట్టి పొట్ట నిండించుకొందు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

గీ. ౧౧

విగ్రహోపాసనములోని విలువ యెఱుఁగ
వలయు ఘట్టంబులో మోతుబరిగ నిలిచి
సాక్ష్య మెంతైన నిత్తువు స్వామి! నీవు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

గీ—౨

అంధవిశ్వాసములచే ననాదిమార్గ
మిది యటంచును దెలియక యిష్టమైన
త్రోవలోఁ బోవ నీ వేల దొరకఁగలవు?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

గీ—౩

మతము, శీలము పెంచి సన్మార్గ మొసఁగి
నీదువైఖరి చూపిన బాధ లేదు;
భక్తి లేనట్టి మతమున ముక్తి లేదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

గీ—౪

స్వామి! మత మను పేర వ్యవస్థ యొకటి
కట్టుదిట్టము చేసి వికారమైన
దాస్య మిచ్చిరి గాని; నీ దారి వేఱు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

గీ—౫

ఉపనిషద్ధర్మ మీ రీతి నున్న దనుచు
నెన్ని చెప్పిన స్వామి! మా కేమి యెఱుగు?
నిన్నుఁ జూచినఁ జాలు మా కెన్నఁడైన
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

గీ—౬

నిన్నుఁ జూచిన భక్తునికన్నఁ దత్త్వ
వేత్తయై నిన్నుఁ జూడని విజ్ఞుఁ డేమి
ఘనత గాంచును స్వామి! సంఘమున నేఁడు ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

గీ—౭

క్రతుకలాపము లేవి యక్కఱకు రావు
తత్త్వమథనము ముక్తికి దారి గాదు
నీదుసన్నిధి లేనిచో నీరజాక్ష !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

గీ—౮

జననమరణసమస్య తీఱని సమస్య
యపునరావృత్తి దురవగాహప్రవృత్తి
యన్ని మఱచియు నిన్నె సమాశ్రయింతు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

గీ—౯

స్వచ్ఛమతతత్త్వమున నీదుశక్తి కొంత
యంతరంగమ్ములోఁ దెలియంగవచ్చు ;
దానిచేఁ గొంత సదుపాయమేని యొదవు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౦౦

వ్యర్థకర్మపరంపర వదలి మదిని
నీదుపాదములే కరుణించు నంచు
నమ్మియున్నాను నేను నిత్యమ్ము స్వామి !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౦౧

విమలవిశ్వజనీనలక్ష్యమును మతవి
ధానమునఁ జూపి స్వామి ! నీ దారి మాకు
నందుపాటుగఁ జేయువా రెందుఁ గలరొ ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౦౨

మతములో విప్లవము దెచ్చి మంచిచెడ్డ
లదుకులను బెట్టి యెందాఁక మెదపి యున్న
నిన్నుఁ జెప్పనిచో నేమి వన్నె కెక్కు ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౦౩

యాగములు యోగములును విరాగములును
జేయలేనట్టి మంచిని జిత్తశుద్ధి
కలుగు భక్తియె చేయఁగాఁగలుగు స్వామి !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౦౪

తర్కమునకన్న ఫలములోఁ దపము మేలు
జ్ఞానమునకన్న ధ్యానభాగంబె మెఱుఁగు
వానిలో నీ ప్రసక్తి గన్పట్టునయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౦౫

నిత్యసత్యస్వరూపమై నిర్వికార
మూర్తియై బ్రహ్మమై స్వయంభువమునైన
నీదునంశము వర్ణింపనేరనయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౦౬

అస్మదాదుల బుద్ధుల కందరాని
జ్ఞానమయుఁడవు గాని, నీ జాడ విడువ
బుద్ధి పుట్టదు గాన, మమ్ముద్ధరింప
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౦౭

ధ్యానసిద్ధిని మించిన జ్ఞానమార్గ
మేదియును లేదనియె మాకు బోధపడును;
గాని, దానికి సిద్ధము గాము స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౦౮

శేముషీతర్కములు బోధ చేయలేని
వెలుఁగు, ధ్యానములోఁ గనిపింపవచ్చుఁ
గాన, నీ ధ్యాన మది నాకుఁ గలుగనిమ్ము
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౦౯

హేతువాదముచే నిర్ణయింపరాని
పెద్ద పెద్ద సమస్యలే ప్రిదిలిపోవు
నిన్ను ధ్యానింపఁగా మేము నేర్చుకొన్న
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౧౦

బుద్ధి కందక చీఁకటి పొడమి తడుము
కొనెడి ఘట్టములో వెలుంగును వెలార్పఁ
గలుగునది ధ్యాన మొక్కటి గాదె స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౧౧

ధ్యానసిద్ధి లభింపని మానవునకు
బుద్ధిశక్తి ఫలింపఁగాఁబోదు స్వామి!
ధ్యానమే దివ్యదృష్టికి దారి చూపు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౧౨

బాహ్యపూజలు చేసి నీ భావ మెఱుఁగఁ
గోరువారల యాశ లీడేరు నెట్లు?
వట్టి స్తోత్రము లెట్లు సత్ఫలిత మిచ్చు?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౧౩

నిశ్చయజ్ఞానము గడించి నీకుఁ జేయు
సేవలో సర్వ మర్పించు భావ మెవని
కుండునో వాఁడె నీదు భక్తుండగు స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౧౪

తాను జేసెడి యే కార్యమేని గాని
'యుష్మదర్పణమస్తు'ని యూహ చేసి
బ్రదుకు మానవుఁడే నీదు భక్తుఁ డగును
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౧౫

ఆత్మదర్శనమే సర్వయజ్ఞములకు
ముఖ్యమైన ప్రయోజనము గను శాస్త్రములు
చెప్పి రా యజ్ఞములె మాదు జీవితములు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౧౬

జీవితమునందుఁ ద్యాగము చేరియున్న
నదియె యజ్ఞస్వరూపము నందుకొనును ;
యజ్ఞ మన నేఁడు మృష్టాన్న మనుట గాదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౧౭

యజ్ఞములు చేసి నేఁడు రంభాదిభామ
లిచ్చు నాలింగనములకు నెవఁడు చూచు ?
జీవితము యజ్ఞమయముగఁ జేయవలయు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౧౮

ఆత్మశిక్షణ గలిగి నిన్నాత్మలోన
దాఁచుకొని లోకమున మంచిదారి చూపు
వారలే యజ్ఞకర్తలు స్వామి ! నేఁడు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౧౯

బ్రహ్మచర్యాదిసత్కర్మఫలిత మొసఁగు
జీవితమె యజ్ఞ మని నేఁడు చెప్పవచ్చుఁ
ద్యాగమే దాని పరమార్థమయ్య స్వామి !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౨౦

నీవు యజ్ఞస్వరూపివి నీ విశేష
మహిమ యజ్ఞులు గుర్తించు మార్గ మేది?
అజ్ఞుఁ డీ యజ్ఞ మెట్లు చేయంగనేర్చు?
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౬౨౧

యజ్ఞమయమైన జీవిత మందుకొనఁగ
స్వామి! నీ యాజ్ఞ మాకు నావశ్యకంబు
దానికోసమె నిత్య ముత్సాహపడుదు;
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౬౨౨

తత్త్వజిజ్ఞాస కేది నిధాన మగునో
సచ్చిదానందమున కేది జన్మ మగునో
యట్టి నీ శక్తి నా కెట్టు లర్థమగును?
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౬౨౩

శాశ్వతానందమయమై ప్రశస్తమైన
జీవితము గోరువానికి నీవుదక్క
శరణ మెవ్వరు లేరయ్యా ధరణిలోన
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ!

౬౨౪

స్వర్గనరకములనుగూర్చి సంశయించు
బుద్ధులకు నీ ప్రభావమే బుద్ధి చెప్పఁ
గలదు; దానికిఁ దార్కాణములును గలవు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౨౫

ఎన్ని తార్కాణములు చూడకున్న నేఁడు
జనము లక్షల కోటుల సంఖ్యలోన
వత్తురే యాత్రగాఁ దిరుపతికి స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౨౬

మాయయో నీదుశక్తియో మాకుఁ దెలియ
వలసినది లేదు మా బ్రదుకులకు నీవె
యండగా నున్నఁ జాలు నిత్యంబు స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౨౭

తత్త్వచర్చాది సర్వ ప్రదర్శనముల
వలన బుద్ధులు మార్పు గావచ్చుఁ, గాని
నిన్ను సేవించు దారినే యెన్నుకొందు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౨౮

నూతనాన్వేషణము చేసి ప్రాఁతవడ్డ
వాని నెన్నింటినో మార్పవచ్చుఁగాక !
నీదుత్రోవకు మార్పు గన్పింపదేమి ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౨౯

సత్యపరిశోధనముచేఁ బ్రచారకాండ
మునకు నెన్నిటినైనఁ గైకొనఁగవచ్చు
నీ ప్రచారము వేఱు నీ నిష్ఠ వేఱు,
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౩౦

జీవితములోని చిత్రవిచిత్రములకుఁ
దట్టుకోలేనియపుడు నీ దర్శనంబె
దారి చూపించి మాకు నాదర్శ మగును
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౩౧

నాస్తికుల వాదమునకు ఖండన మొనర్పఁ
గడఁగువారికి నితరమార్గము లవేల ?
నీదుదర్శన మొక్కటే బోధపఱుచు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౩౨

ఊహ కందని వట్టి తత్త్వోపదేశ
ములకు నందవు; భక్తితో మెలఁగువారి
కందెదవు స్వామి! నీలో మహత్త్వ మదియె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౩౩

నిర్గుణుండవె కావచ్చు నిన్ను బోధ
పఱుచుకొను మార్గ మేదొ కావలయుఁ గాన
నిన్నుఁ బెక్కువిధాల వర్ణించిరయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౩౪

తీవ్రజిజ్ఞాసువులు నూత్నదివ్యతత్త్వ
బీజములు ప్రోవు వోసి చూపించి; రైన
నీ యుపాసనలో మార్పు చేయలేరు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౩౫

ధ్యానకాలములో నవధానమహిమ
చేత భక్తుఁడు నిన్నుఁ బూజింపఁగలఁడు
యోగికైనను సులభగమ్యుఁడవు గావు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౩౬

క్షుద్రవాంఛలచేత సంక్షుభితమైన
చిత్తమున నీదుశక్తి కించిత్తుగూడఁ
దెలియకుందుము స్వామి! మమ్మాలుగఁబోకు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౩౭

సర్వవాంఛలలోఁ జవిసార మున్న
వాంఛ యేదియొ గుర్తించువాఁడె నిన్నుఁ
గొంచెమైనను భావించి కొలువఁగలఁడు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౩౮

చెక్కు చెదరని భక్తివిశేష మెవని
కబ్బునో వాఁడె తన హృదయాన నిన్ను
దాఁచుకోనేర్చు; వాని పద్ధతియు నదియె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౩౯

ప్రతి- పదార్థము సంపూర్ణపక్వదశకు
వచ్చి మార్పులు కూర్పులు పడయుటకును
గారణము నీవె యని నమ్మఁగలము స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౮౦

వివిధతత్త్వములను వ్రేలువెట్టి చూపు
వెలుఁగు నీలోన భక్తులు కలయఁజూతు ;
రదియె వారికి నీకు నున్నట్టి లంకె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౮౧

వయసు మఱలకమున్నె యెవ్వనికి నీదు
భక్తియుఁ బ్రపత్తియును లభ్యపడునో వాఁడె
ధన్యుఁ ; డాఁతఁడె భక్తవతంసుఁడయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౮౨

మానవుని నోట నిఁబగు మాటఁబెట్టి
హృదయమున నున్న భక్తి పరీక్ష చేయ
వచ్చునందుకు తెలిసినవారు స్వామి !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౮౩

మేము నీ యాజ్ఞలో నుండి యేమి చేయు
చున్నదిఁగు సర్వమును నీవు చూడఁగలవు
నీవు చేయువుల సాక్షివి కావె స్వామి !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౮౮

ధనము గలవాని జేబులో దైవ ముండు
ననెడి సూక్తికి లక్ష లక్ష్యములు గలవు
పేదల కెడందలోనె కన్పింతువయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౬౮౭

నిన్ను హృదయమ్ములో నమ్మి యున్నవాని
కెల్ల వేళలఁ గవచమై యీఁగయేని
ప్రాలకుండఁగఁ గాపాడవత్తువయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౬౮౬

నీదుపజ్జకు నడుగు లెన్నిటిని భక్తుఁ
డుంచునో వాని కినుమడి యుంచి నీవె
యెదురు వత్తువు నీ శక్తి యెవరి కెఱుక ?
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౬౮౯

ఆధిచే వ్యాధిచే, భక్తుఁ డైనవాఁడు
బాధపడుటకు ముందె యేర్పఱిచి మందు
సిద్ధముగఁ జేసి యతని రక్షింతువయ్యా
వేగ రావయ్యా తిరుమల వేంకటేశ !

౬౮౮

ఆదిలో సాలెగూడుగా నవతరించు
పాపమే కాలపాశమై బాధపెట్టు;
నీ రహస్యము నీ భక్తుఁ డెఱుఁగుఁగాదె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౮౯

అంగభేదములను బట్టి యన్ని ప్రాణు
లొకటి కాదను భ్రాంతిలో నుందుమయ్య
యాత్మ యన్నది యొక్కటే యన్నిటికిని
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౯౦

కంటికిని గానరాక మా యొంటి కంటి
యున్న మృత్యువు నడుమలో నుంచి మాకు
మేలు చేసెదవయ్య నిన్నేల మఱతు ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౯౧

జాతిగోత్రాది బహిరంగ సాధనములఁ
బట్టి నీ ప్రేమమును మేము పడయలేము ;
పుణ్యపాపంబులే మాకుఁ బుట్టగతులు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౫౨

నీవు జ్యోతిస్స్వరూపుఁడవై విశాల
భావములు సర్వమతములవారి కిత్తు;
వదిమె నీలోని దివ్యమహాత్త్వ మేమొ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౫౩

కపటమును నాస్తికత్వము గర్వబుద్ధి
విడిచి ధర్మము బోధింపఁ గడఁగువాఁడె
యగ్రవర్ణుఁడు నీ దృష్టియందు స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౫౪

అతిథిసేవయు బ్రహ్మచర్యాదిసుగుణ
గణము లున్నప్పుడే నిన్నుఁ గాంచఁగలుగు;
వాఁడె యుత్తమభక్తుఁ డివ్వసుధలోన
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౫౫

హృదయవైశాల్యమును సత్యపథము తృప్తి
గలిగి నీ శక్తి గుర్తింపఁ గలిగియున్న
భక్తవరులకు నీకు సంబంధ ముండు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౫౬

మోసమును జేసి జీవించు బుద్ధికన్నఁ
జావు మేలని తెలిసియుఁ జాలవఱకు
మోసపోదుము నీయెడ ధ్యాస లేక
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౫౭

లోభ మను పెద్ద భూతములోని శక్తి
మమ్ము లోఁగొని దృష్టిమాంద్యమ్ము నిచ్చి
నీ ప్రమేయము దరికి రానీయదయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౫౮

కాలమే జీవనము; దానిఁ గర్చుపెట్టు
కొనుటలో లాభనష్టములను బరీక్ష
చేయువాఁ డెన్నఁడైన నిన్ జేరఁగలఁడు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౫౯

కాలమున కున్న విలువ యెక్కుడనుగాని
దేనికిని లేదు; కొనుటకుఁగాని యప్పు
తెచ్చుటకుఁగాని దొరకదు; తెలియలేము
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౬౦

సమయమును నీదుసేవకు సరిగఁ గర్చు
పెట్టి లాభము వడ్డియుఁ బీల్చువాఁడు
నీదుభక్తుఁ డొకండు కాదే ధరిత్రి?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౬౧

సరళధోరణిలోఁ దత్త్వశాస్త్ర మెంత
బోధ చేసిన స్వామి! నీ మూర్తి మాకుఁ
గానరా దొక్క భక్తుఁడే కాంచునేమొ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౬౨

లోక మంతయు నస్థిరమై క్రమేణ
దుఃఖమయమై యసంతృప్తితోడ నిండి
యుండినను మేము గుర్తింపకుందు మేల?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౬౩

కర్మఫలమును నమ్మి నిష్కల్మషముగ
నడువ నేర్చినవాని మనస్సులోన
నీవు తిరముగ నిలిచి కన్పింతువయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౬౪

మనసు వాక్కును గాయకర్మములు మాకు
మంచి సాధనములుగ నీ వుంచియుంటి
వైన, గుర్తింపలేము ప్రాప్యమును స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౬౫

తలలు నెఱసినమాత్రాన విలువ కట్టఁ
బెట్టవలసిన పని లేదు; పెద్ద లెవరో
పిన్న లెవ్వరో గుణములే పిలిచి చూపు;
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౬౬

సత్యమును ధర్మము నహింస సాధుమార్గ
మవని నెవనికి నిత్యకృత్యములు నగునో
వాఁడె నీ సన్నిధికి సులభముగ వచ్చు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౬౭

చందనముకన్న సర్వపుష్పములకన్న
ధర్మసౌరభమే శ్రేష్ఠతమము భువిని
దాని గుర్తించువాఁడె నీ దాసుఁడయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౬౮

ద్వేష మన్నది మఱచి యేదియును దాను
గోర కెప్పుడు ప్రేమమే గోరువాఁడు
నీదు ప్రేమకు యోగ్యుఁడుకాదె స్వామి !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౬౯

సిద్ధులకు జ్ఞానధనులకుఁ జిత్తశుద్ధి
గలుగు భక్తులకును బెద్ద గౌరవంబు
చూపెదరు లోకు; లిందలి సూక్ష్మ మేమొ
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౭౦

స్వామి ! నీ కిచ్చు మఱుగు కాంచనముకన్నఁ
గనికరంబను గుణ మొక కణమె మిన్న
యది యెఱుంగనివాఁడు నీ మదికె రాఁడు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౭౧

ఎవఁడు కామమునకు భృత్యుఁ డవునొ వాఁడు
నీకు భృత్యుఁడు కాలేఁడు నిజము స్వామి !
యిర్వురకు భృత్యుఁ డగుటయు నెట్లు పొసఁగు !
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౭౨

జీవితములోన భయమెట్టు చేష్ట లెన్నొ
భక్తునకుఁ దోఁచు; మృత్యువుభయము మాత్ర
మతని కే కోశమునఁగాని యంటఁబోదు;
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౭౩

నాకమో లేక నరకమో నాకుఁ జూపి
స్వామి! మా చేతులకు నందుపాటు చేసి
యుందు వది మేము గుర్తింపకుందుమయ్య
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౭౪

మంచి హృదయమును స్వామి! నీ పాదాల కిచ్చు
పలికి లోకుల కింత సంబరము గల్గు;
నెవ్వ రికది దక్కునో వారె భాగ్యు లిలను
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౭౫

సేవ ప్రేమము-త్యాగ మిదా జీవితమున
కంకితము గావించినాము మా కింక స్వామి!
యేమి నీ విచ్చినను బాధ మేమి లేదు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౭౬

కర్మఫల మనివార్యమౌ ధర్మ మనుచు
నెఱిఁగియును మాయలోఁ బడి మఱచిపోదు
మేమి చేసిన నీవె మా కేడుగడవు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౭౭

యుగయుగంబులు స్వామి! నీ యునికి మనికి
దెలియవలెనని యెంత యత్నించిరయ్య!
లీలగానైనఁ గన్పింప వేల నీవు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౭౮

నీవు కన్పింపకున్నను నీదు మహిమ
యర్థమగుచుండు నది యొక యద్భుతంబు;
గాలి వీచియుఁ గంటికిఁ గానఁబడునె?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౭౯

నీ మహత్త్వము గుర్తింప నేర్చువాని
కే విషాదము మోహ మదెన్నఁడేనిఁ
గలుగనీయక కాపాడఁగలవు స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౮౦

నీదు తత్త్వము మనసులో నిలిచియున్న
వాని కే బాధయును లోటుపాటు లుండ;
వట్టి యోగ్యత నా కీయవయ్య స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౮౧

జన్మములు కర్మము లనంతసంఖ్యలోన
జరుపుకొను మాకు నీ ప్రపంచము విచిత్ర
మైన 'మజిలీ'గ భావింతుమయ్య స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౮౨

అట్టి మజిలీలలోఁ గనిపెట్టి నీకుఁ
బూజ సేయఁగలాఁడెవో పుణ్యపురుషుఁ
డాతఁడే జన్మరాహిత్య మందుకొనును
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౮౩

మోహమన్నది బంధనమునకు మూల
మది త్యజించినచో సౌఖ్య మొదవు నంచుఁ
జదివెదముగాని బుద్ధిలోఁ గుదురదయ్య!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౧౪

సర్వపురుషార్థములఁ గూర్చి సర్వమతము
లనుమతించిరి నీ శక్తి నన్వయింపఁ;
గాని, భేదము నీ పేరులోనె స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౧౫

సంచితాగాము లారబ్ధజన్మకర్మ
ధర్మములు సర్వమతముల ధర్మము లగు;
భేద మింక నిన్నుఁ బిలిచెడి పేరులోనె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౧౬

శ్రవణమనననిధిధ్యాసజనితమైన
జ్ఞానమది సర్వమతములలోన సమమె;
కాని, నీ పేరు వేర్వేరుగా వచింత్రు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౧౭

సాంఘికాచారములయు సంస్కారములయు
భేదమునుబట్టి నీ నామభేదములను
దెచ్చుకొని వాదములకును దిగఁగ నేల?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౮౮

ఎందుఁ జూచినఁ బరతత్త్వ మేదొ యొకఁడు
కలదు కలదంచు నమ్మకములును గలవు;
కాని, భేదము విడువ రీ కర్మ మేమొ!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౮౯

సత్యము దయాగుణము సాధుసంగతియును
ముఖ్యమని సర్వమతములు ముచ్చటించుఁ;
గాని, తుద కేదొ భేదమే కానవచ్చు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౯౦

వాదభేదము లనెడి యీ బాధ లేవి
నాకుఁ బట్టవు స్వామి! నీ నామరుచికై
వాచిపోవుచు నీకయి వేచియుందు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౬౯౧

వ్రాసికొని భక్తితో నేను వందలుగను
జేసి యీ చిన్నికావ్యముచేత నిన్ను
ధ్యాన మొనరించుకొందు నిత్యమును స్వామి!
వేగ రావయ్య తిరుమల వేంకటేశ!

౨౦౦

సరిగ మొదలిడి రెండు*మాసములుకూడ
నిండలేదయ్య నిన్ను వర్ణింపఁదొడఁగి
శరపరంపరగా 'సప్తశతియు' నిండె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

ఇది
శ్రీ శేషాద్రిశేఖర విభుప్రసాద సమాసాదిత
మహితకవితాధురీణ
ఆంధ్ర విశ్వకళాపరిషదర్పితవిద్వద్బిరుద
విరాజిత పాండితీప్రవీణ
కలిపురాణాద్యనేక కావ్యనిర్మాణ పారీణ
శ్రీ రాజరత్నాంబా - బుచ్చయ్య ప్రథమపుత్త్ర
సత్యనారాయణచౌదరి
రచించిన
మా స్వామి యను కావ్యము
సర్వము సమాప్తము

शुभम

* రచన మొదలు 30-7-1960
పూర్తి 27-9-1960

౬౯౬

భక్తియోగములోని ప్రభావమునకు
సంకితంబైన నా హృదయమున నిన్ను
శాశ్వతంబుగ ముద్రింపఁజాలి యుందు
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౯౭

మ్రొక్కులేమి నాకు హక్కు ; నా యక్కఱలను
దీర్పవా యని నిన్ను బాధింపనయ్య
యేను నీ వాఁడనైన నా కేమి తఱుగు ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౯౮

నా కవిత్వములోఁ జవి నీకుఁ దెలిసి
నీ మహత్త్వములో రుచి నేను దెలిసి
యున్నచోఁ జాలు లోప మే ముండునయ్య ?
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౬౯౯

శార్వరీశ్రావణము శుద్ధసప్తమికిని
గలము పట్టి రచింప సంకల్ప మొదవె ;
ఆశ్వయుజ శుద్ధసప్తమి కదియు ముగిసె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

౨౦౦

సరిగ మొదలిడి రెండు*మాసములుకూడ
నిండలేదయ్య నిన్ను వర్ణింపఁదొడఁగి
శరపరంపరగా 'సప్తశతియు' నిండె
వేగ రావయ్య తిరుమల వేంకటేశ !

ఇది
శ్రీ శేషాద్రిశేఖర విభుప్రసాద సమాసాదిత
మహితకవితాధురీణ
ఆంధ్ర విశ్వకళాపరిషదర్పితవిద్వద్బిరుద
విరాజిత పాండితీప్రవీణ
కలిపురాణాద్యనేక కావ్యనిర్మాణ పారీణ
శ్రీ రాజరత్నాంబా - బుచ్చయ్య ప్రథమపుత్త్ర
సత్యనారాయణచౌదరి
రచించిన
మా స్వామి యను కావ్యము
సర్వము సమాప్తము

शुभ

* రచన మొదలు 30-7-1960
పూర్తి 27-9-1960

# ఏతద్గ్రంథకర్తృ - రచనలు

| | | |
|---|---|---|
| 1. | వైదికవాఙ్మయ చరిత్ర | రు.3.00 |
| 2. | పతీనప్రతి (పద్య) | 0.25 |
| 3. | కథావింశతి | 0.65 |
| 4. | చంద్రాపీడ చరిత్ర | 0.50 |
| 5. | కామశాస్త్రము | 2.00 |
| 6. | కావ్యమాల 1 భాగము | 1.50 |
| 7. | కావ్యమాల 2 ,, | 1.50 |
| 8. | సుభాషితము | 0.25 |
| 9. | ధర్మశాస్త్రము | 3.00 |
| 10. | కవులకథలు | 0.65 |
| 11. | వరరుచి | 0.75 |
| 12. | ఈశ్వర సేవకులు | 1.00 |
| 13. | విక్రమకథలు | 0.65 |
| 14. | మ్రొక్కుబడి (పద్య) | 1.00 |
| 15. | నవనాథము | 1.50 |
| 16. | బృహత్కథలు | 0.75 |
| 17. | వత్సరాజు | 1.25 |
| 18. | విక్రమాదిత్యము | 0.75 |
| 19. | సాలభంజికలు | 0 63 |
| 20. | బాపూజీ (పద్య) | 1.00 |
| 21. | చారుదత్తము | 1.25 |
| 22. | నీతిచంద్రిక (శరదీపికా వ్యాఖ్యా సహితము) | 3.00 |
| 23. | చిన్నయ్య (సూరిచరిత్ర) | 0.50 |
| 24. | నైషధము | 1.25 |
| 25. | కలిపురాణము (పద్య కావ్యము 1 భాగము) | 2.00 |
| 26. | ప్రతాపసింహము | 1.25 |
| 27. | వీరపూజ | 1.25 |
| 28. | చాణక్యము | 1.15 |
| 29. | దివ్యమూర్తులు | 1.25 |
| 30. | స్వారాజ్యకథలు | 1.25 |
| 31. | మాయాభిక్షువు (పద్య) | 1.25 |
| 32. | కలిపురాణము (2. భా) | 2.00 |
| 33. | మా స్వామి (పద్య) | 3.00 |
| 34. | మంజరి (చాటుపద్య) | 2.00 |
| 35. | జాతకకథలు | 0.75 |
| 36. | అంజలి (పద్య) | 1.25 |
| 37. | కల్పవృక్షఖండనము | 3.00 |
| 38. | 'పంచశతీ' పరీక్ష | 0.50 |
| 39. | సైరంధ్రి | 2.00 |
| 40. | కులపతి (శ్రీవరదాచార్యులవారి జీవితము) | 1.25 |
| 41. | స్వరాష్ట్రము [పద్య] | 1.00 |
| 42. | కలిపురాణము (3. భా) | 2.00 |
| 43. | కలిపురాణము (4. భా) | 2.00 |
| 44. | కలిపురాణము (5. భా) | 2.00 |
| 45. | మేవాడవిజయము | 2.00 |
| 46. | మహారథులు | 1.25 |
| 47. | లోకతంత్రము [పద్య] | 1.25 |
| 48. | సాహితీసమీక్ష | 1.25 |
| 49. | నాయుపాధ్యాయగిరి | 1.25 |
| 50. | త్యాగయ్య | 1.25 |
| 51. | రామరాజ భూషణము | 1.25 |
| 52. | కావ్యకథలు | 0.75 |
| 53. | తెలుఁగువెలుఁగులు | 0.75 |
| 54. | చిత్రకథలు | 0.65 |
| 55. | వినోదకథలు | 0.65 |
| 56. | పండితుఁడు [పద్య] | 0.25 |
| 57. | శిశుఘ్న ,, | 0.25 |
| 58. | శకున్తలా (సంస్కృతము) | 1.00 |
| 59. | కవిత్రయము | 1.00 |
| 60. | తెలుఁగులక్షణము | 1.00 |
| 61. | వాల్మీకము | 1.00 |
| 62. | మాలిక [పద్య] | 1.00 |

భాషాపోషకగ్రంథమండలి (Regd) అమృతలూరు-గుంటూరు జిల్లా